శ్రీః

శ్రీ కూచిమంచి తిమ్మకవి విరచిత

# శివలీలావిలాసము

(విస్తృతపీఠికతో)



స్వప్న పబ్లికేషన్స్
పెరిదేపి, వేములపాడు (పోస్ట్), ప్రకాశంజిల్లా.
పిన్ : 523 273

శ్రీః

శ్రీ కూచిమంచి తిమ్మకవి విరచిత

# శివలీలావిలాసము



ప్రకాశకులు

**స్వప్న పబ్లికేషన్స్**

పెరిదేపి, వేములపాడు (పోస్ట్) - 523 273, ఒంగోలు జిల్లా.

శ్రీః

శ్రీ కూచిమంచి తిమ్మకవి విరచిత

# శివలీలావిలాసము

ప్రథమముద్రణ :- మహాశివరాత్రిపర్వదినము ది. 12-02-2010
ప్రతులు : 500
పేజీలు : 76
వెల రూ. : 40-00


4-103, I.L.T.D. Colony, Extn.,
Kothapet,
CHIRALA - 523 157
Cell: **94401 15411**

ప్రతులకు:-

ఉన్నం జ్యోతివాసు
పెరిదేపి, వేములపాడు (పోస్ట్)-523 273
ఒంగోలు జిల్లా.
సెల్ : 9296003160

***D.T.P. by :-***
**J. RAJA**
**Ganesh Graphics,**
Munthavari Centre, Chirala.
Cell : 98483 90564

***Printed at :-***
**SURYA OFFSET,**
**CHIRALA.**



"రసో వై సః । రసగ్గం హ్యేవాయం లబ్ధ్వానన్దీభవతి ॥" అని తైత్తిరీయోపనిషత్తు(2.7) ఏ రసమునుపొంది మానవుడు ఆనందము నొందుచున్నాడో యదియే పరంబ్రహ్మము, ఆత్మతత్త్వము నైయున్నది. శ్రీచక్రనవావరణములకు క్రమముగ శృంగారాదినవరసములు, రసాధిదేవతలును పేర్కొనబడినవి. శృంగారము రసరాజము, జగన్మాతను రసాదులచే వర్ణించుట స్తుతించుటయే.

పరమశివుని నిండుపేరోలగమున 'గంగాభవాని' అందచందాలనే వర్ణించి అప్పరమశివుని మనసున ప్రణయకల్లోలము కల్గించి గంగాధవుణ్ణి చేసినవాడు పరమ భాగవతుడు, దేవర్షియగు నారదుడు, ఆ గాథను నారదుని ద్వారా గ్రహించినవాడు పితృభక్తిపరాయణుడు, రాజర్షియగు 'భీష్మాచార్యులు', అద్దానిని గాంగేయునినోట విన్నవాడు నారాయణసంబంధి, నరర్షియగు పార్థుడు.

శ్లో॥ ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్యాన్ ।
రుక్మాఙ్గదార్జున వశిష్ఠ విభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి॥

ఈ గాథను 'శివలీలావిలాస'మనుపేరు ప్రబంధ రచన గావించిన శ్రీకూచిమంచి తిమ్మకవియును, అద్దానిని అధ్యయనాధ్యాపనములు గావించువారును, నారద, భీష్మ, పార్థులవలె అమనస్కమహనీయులే యగుదురు.

1921 లో వావిళ్ళవారిచే ముద్రింపబడిన ఈ ఐదు ఆశ్వాసముల ప్రబంధమునకు 'ప్రరోచన' నామముతో యతివిపులపీఠిక నందించినవాడు యువకుడగు శ్రీ ఉన్నం జ్యోతివాసు ఆ గంగాధవుని ప్రేమకు పాత్రుడగు గాక! గంగాదేవి అందచందాలను వర్ణించు సందర్భమున అటు నారదునకు, తదుపరి పలికిన భీష్మునకు, విన్న పార్థునకు, ఆ గాథను లిఖించిన తిమ్మకవికిని అనౌచిత్యము నాపాదించరాదనియే సూక్ష్మపరిశీలనచే సర్వులకు తెలియగలదని తలంతును.

ఈ ప్రబంధప్రతిని క్షుణ్ణంగ, నిశితంగ పరిశీలించి సుశోభిత మొనర్చినవారు డా॥ వుయ్యూరు లక్ష్మీనరసింహారావును పరమపావనియగు గంగాభవాని ఐశ్వర్యప్రదాయుని చేయుగాక!

శుభం భూయాత్

వాడరేవు — సంపాదకుడు

14-01-2010 — రా మో రా

# శివాకాంక్షలు

శ్రీ రామోరాగారు విద్వజ్జనసంస్తవనీయసంస్కృతగ్రంథమాలికా ముద్రణార్చనలతో జగదంబను, శారదంబను సేవిస్తున్న విషయం విద్వల్లోకవిదితమే. మధ్య మధ్య ఆంధ్రగ్రంథరత్నాలతో కూడా అర్చించటం పరమసంతోషదాయక విషయం. నిన్న బహుళాశ్వచరిత్ర, నేడు శివలీలావిలాసము అందించి పండితులను నానందింపజేశారు. ఈ రెండు గ్రంథములు శ్రీ రామోరా జ్యోతివాసుల కలయికలో వెలువడటం విశేషం.

శ్రీనాథకవిసార్వభౌమునికీ ఈ తిమ్మకవిసార్వభౌమునికీ చాలా పోలికలున్నాయి. ఇద్దఱూ ఉద్దండపండితకవులే. ఇద్దఱూ విష్ణుద్వేషంలేని శివభక్తులే. అయితే మన కూచిమంచి కవి శతకాలు, అచ్చ తెలుగుకావ్యాలు నిర్మించి మించాం డు. లక్షణసారసంగ్రహమనే లక్షణగ్రంథం కూడా నిర్మించి అభినవవాగనుశాసన బిరుదాన్ని సంపాదించాడు. శ్రీనాథుడు పూర్వుండు కావటంచేత పలువిషయాలలో ప్రబంధకవుల మాదిరిగానే అతనిని అనుకరించటం తిమ్మకవికి తప్పలేదు. ఇది కవి సంప్రదాయంలో భాగమైన విషయం. పరిశోధకులకు పనికావాలి కదా!

శివలీలావిలాసాన్ని పీఠికతో సిద్ధంచేసిన చిరంజీవి జ్యోతివాసును, ప్రతిఫలాపేక్షారహితంగా అచ్చువేయించి ఆంధ్రజాతికి అందించిన శ్రీ రామోరా గారిని హృదయపూర్వంగా అభినందిస్తున్నాను. ఇలాగే వీరు శారదాదేవీపదపద్మాలను ఆరాధిస్తూ ఆ తల్లిదీవెనలతో నిరంతరం సారస్వతయాత్రను సాగించాలని మనసారా శివాకాంక్షలు తెలుపుతున్నాను.

ఇట్లు
సుధీజనవిధేయుడు
వుయ్యూరు లక్ష్మీనరసింహారావు

గుంటూరు
01-01-2010




పరమత సహనము తక్కువగా ఉన్న కాలములో కూచిమంచి తిమ్మకవి పుట్టాడు. ముస్లిములు హిందువులగుళ్ళను దోచుకోవడం, పడగొట్టడం అనవాయితీ అయింది. వారికి క్రైస్తవులు కూడ తోడయ్యారు. 18వ శతాబ్ద ప్రారంభములో పుదుచ్చేరిలోని హిందువుల గుళ్ళను పడగొట్టారు. అప్పుడే ఉత్తరాదిన ఔరంగజేబు కాశీగుడిని పాడుచేసాడు. ఈ దారుణాలను సహించలేని కవులు -

*సీ॥ మొగలాయి దెబ్బకే ముగిసె నీ పనులెల్లఁ*
*దగ పార్థు దెబ్బకు ఁదాళుటెట్లు*
*జడియక త్రిపురల సంహరించిన నీవు*
*పగ్గి తురకలఁ జూచి పాఱుటెట్లు (ఏకామ్రలింగశతకం)*

- అని పరమేశ్వరుని నిలదీశారు.

ఆంధ్ర కళింగప్రాంతములో కూడ ముస్లిములు, మరాఠీలు, పిండారీలు, పరాసులు మొదలైనవారు గ్రామాలు, గుళ్ళను దోచుకొనేవారు. ఊళ్ళలో రక్షణ కరువై ప్రజలు అడవులు పట్టారు. ముస్లిములు సింహాచల ఆలయాన్ని కూడ దోపిడీ చేయబోతుంటే ప్రజలు కవులు చలించిపోయారు. స్వామిని ప్రార్థించారు. మొత్తుకున్నారు. ఎత్తిపొడిచారు. తిట్టారు. స్వామికి కూడ తురకమతము మీద ప్రేమ పుట్టిందా అని అనుమానమొచ్చింది. "బీబీ నాంచారిని పిలిపింపు వేగమే తుదకభ్యసింపుమా తురక భాష" - అని ఎత్తిపొడిచారు. కవి ఆశువుగా చెప్పిన ఈ పద్యాల కాకకి సింహాచలం కొండమీది తేనెటీగలు రేగి దోపిడీదారులను విశాఖపట్టణములోని శ్మశానము మెట్టుదాక తరిమాయి.

ఇలా దోపిడీల కారణంగా ప్రజలకు రక్షణలేని కాలములో పిఠాపురానికి దగ్గరలో ఉన్న కందరాడ గ్రామములో కూచిమంచి తిమ్మకవి పుట్టాడు. తండ్రి గంగన. తల్లి లక్ష్మమ. గంగన ఆ గ్రామ కరణము. పండితులను, కవులను బాగా ఆదరించాడు. చిన్నతనం నుండి విద్వాంసుల మధ్య మెలగడంవలన తిమ్మకవికి, తమ్ముడు జగ్గకవికి సాహిత్యాభిరుచి పెరిగి, కృషిచేసి ప్రౌఢకవులయ్యారు. వక్కలంక వీరభద్రకవి (వాసవ దత్తాపరిణయ కావ్యకర్త), ఈదులపల్లి భవానీశం (ధర్మఖండ కావ్యకర్త), ఏనుగు లక్ష్మణ కవి మొదలగు కవులు తిమ్మకవికి స్నేహితులు, బంధువులును.

తిమ్మకవి పుట్టింది కందరాడ గ్రామమైనా కుక్కుటేశ్వరస్వామి కొలువున్న పిఠాపురానికి వచ్చాడు. స్వామివారి భక్తుడయ్యాడు. దెందులూరి లింగనారాధ్యుల వద్ద శివదీక్ష పొందాడు. తన జీవితాన్ని సాహిత్యాన్ని స్వామివారికే అంకితము చేశాడు. 50 ఏండ్ల సాహిత్యజీవితములో ఎన్నో కావ్యాలు, శతకాలు, దండకాలు వ్రాశాడు. 15 రచనలు మాత్రమే తెలుస్తున్నాయి. అవి -

1. **రాజశేఖరవిలాసము:-** ఇది భల్లాణరాజ చరిత్ర. రచనలో అంత పరిపక్వత కన్పించదు. 541 పద్యగద్యాలున్నాయి. వ్యాకరణదోషాలున్నాయి. ఒకసారి అచ్చు పడింది.

2. **రుక్మిణీపరిణయము:-** ఇది 5 ఆశ్వాసాల కావ్యము. ప్రబంధవర్ణనలతో శబ్దాలంకారాలతో, శ్లేషలతో ప్రౌఢమైన కావ్యమిది. రచనా కాలము క్రీ॥శ॥ 1715. వావిళ్ళవారు చాలాసార్లు ముద్రించారు.

3. **కృష్ణదండకము:-** దీని లిఖితప్రతి మద్రాసు ప్రాచ్యలిఖిత భాండాగారములో ఆర్924(బి) సంఖ్యతో ఉంది. కవి ఎన్నో దండకాలు వ్రాసినప్పటికీ దొరుకుతున్న దండక మి దొక్కటే. ఇది అచ్చుకాలేదు.

4. **చిరవిభవశతకము:-** శైవగాథలగురించి చెప్పే శతకమిది. ఇది ఒకసారి అచ్చయింది కాని ప్రతులు దొరకడం లేదు.

5. **సింహాచలమాహాత్మ్యము:-** సింహాచలక్షేత్రమాహాత్మ్యాన్ని వర్ణించే ప్రబంధమిది. సింహాచలక్షేత్రము తరపున అచ్చయింది.

6. **నీలాసుందరీపరిణయము:-** ఇది అచ్చ తెలుగు కావ్యము. కవికి పేరు తెచ్చిన కావ్యాలలో ఇదొకటి. మూడాశ్వాసాలు, 356 పద్యగద్యాలున్నాయి. కవి సంస్కృత పదాలకు తయారుచేసిన అచ్చ తెలుగుపదాలు బాగున్నప్పటికి, భూసురునకు పుడమిదయ్యము అన్న తెలుగు, ఆరుద్రగారికి వికృతంగా ధ్వనించాయి.

7. **అచ్చ తెలుగురామాయణము:-** అడిదము బాలభాస్కరుడు మొదట అచ్చ తెలుగు రామాయణము వ్రాసినప్పటికీ లభిస్తున్నవాటిలో తిమ్మకవిదే మొదటిది. ఇందులో 6 కాండలలో 1354 పద్యగద్యాలున్నాయి. నీల కావ్యములోని పద్యాలు, పద్యపాదాలు, దండకమును కవి ఇందులో యథాతథంగా వాడుకొన్నాడు.

8. సారంగధరచరిత్రము:- చేమకూర కవి సారంగధర కావ్యానికి ఇది ద్విపదీకరణము. ఈ కథ రాజమండ్రిలోనే జరిగిందని తిమ్మకవి ఖరారు చేశాడు. ఇందులో రెండు ఆశ్వాసాలు ఉన్నాయి. రచనాకాలం క్రీ॥శ॥ 1729. ఒకసారి అచ్చయింది.

9. భర్గశతకము:- ఇందులో శైవకథలు, లోకనీతులు ఉన్నాయి. రచనాకాలము క్రీ॥శ॥ 1729.

10. సాగరసంగమాహాత్మ్యము:- దీనిని కవి 'సప్తార్ణవసంగమాహాత్మ్య' మని పేర్కొన్నాడు. బ్రహ్మవైవర్తపురాణములోని కథ ఆధారంగా వ్రాయబడిన ప్రబంధ మిది.

11. లక్షణసారసంగ్రహము:- వంగ, త్రిలింగ, ద్రవిడ దేశభాషలలో కవిత్వము చెప్పగలిగిన తిమ్మకవి వ్రాసిన లక్షణ గ్రంథమిది. నన్నయ విరచిత ఆంధ్రశబ్ద చింతామణిసూత్రాలను వివరించడములో కొన్నిచోట్ల అప్పకవిని కూడ అనుసరించాడు. కొన్నిచోట్ల అప్పకవినీ, చింతామణిని కూడ కాదని స్వమతాన్ని ప్రదర్శించాడు. మూడు పురుషలలోను క్రియాంత ఇకార సంధి వైకల్పికతను సమ్మతించుట, 'కు' విభక్తికి ముందు 'న' కార రాహిత్యమును ప్రమాణము చేయుటలోను తిమ్మకవి స్వతంత్రించాడు. ఈ రచన వలననే తిమ్మకవికి 'అభినవవాగనుశాసనుడు' బిరుదు వచ్చింది. రచనాకాలం క్రీ॥శ॥ 1740.

12. రసికజనమనోభిరామము:- బ్రహ్మపురాణములోని గోదావరి ఖండములో ఉన్న 'వృద్ధస్రవంతీ సరిత్పతి సంగ మాహాత్మ్య' మనే కథను తీసికొని తిమ్మకవి రసిక జన మనోభిరామమనే ఆఆశ్వాసాల శృంగార కావ్యంగా రచించాడు. ఇది చాలా ప్రౌఢమైన ప్రబంధం. పిల్లవసుచరిత్ర అన్నపేరు కెక్కింది. వసుచరిత్రను పోలిన పద్యాలు అడుగడుగున కన్పిస్తాయి. ఇందులోని 'పరిపరిపీలుకర్బుర' - అన్న పద్యం 15 నిఘంటువుల సాయం లేనిదే అర్థం కాదని పెద్దలంటారు. రచనాకాలం క్రీ॥శ॥ 1750.

13. సర్పపురమాహాత్మ్యము:- నారదుడు కొలనులో మునిగి స్త్రీగా మారి, నికుండ రాజుతో సంసారం చేసి, పిల్లలను కని, వారంతా యుద్ధములో మరణిస్తే దుఃఖించడము ఇత్యాదిగా ఉన్న దేవీభాగవతకథను స్వీకరించి, సర్పపురములో వెలసిన భావనారాయణుని మాహాత్మ్యమును కవి వర్ణించాడు. ఈ కథనే రాధామాధవకవి కూడ విష్ణుమాయానాటకములో స్వీకరించాడు. తన కృతులన్నిటిని

కుక్కుటేశ్వరునికే అంకితమిచ్చిన తిమ్మకవికి విష్ణుమూర్తి కలలో కనిపించి తనకీ కృతి అంకితమివ్వ మని కోరితే కవి వ్రాసిన గ్రంథమిది. ఇది మూడాశ్వాసాల కావ్యము. రచనా కాలం క్రీ॥శ॥ 1754.

14. **శివలీలావిలాసము:-** ఇది కవి 31 దినములలో చెప్పిన కావ్యము. భీష్ముడు అర్జునునికి చెప్పిన గంగావివాహము ఇందలి ఇతివృత్తము. రచనా కాలము క్రీ॥శ॥ 1756. 1921 లో వావిళ్ళవారు ముద్రించారు.

15. **కుక్కుటేశ్వర శతకము:-** ఇది కవి చివరి రచన. వృద్ధాప్యములో, భార్య గతించింది. పిల్లలు లేరు. తమ్ముడు జగ్గకవి చేరదీసాడు. వృద్ధాప్యపు బాధలు కవి వర్ణించిన తీరు చూస్తే కళ్ళు చెమరుస్తాయి. రచన పూర్తికాకుండానే కవి కాలంచేశాడు. అందువలననే 92 పద్యాలు లభిస్తున్నాయి.

ప్రస్తుత **శివలీలావిలాసము** రెండు ఆశ్వాసాల లఘుకావ్యము. కవి దీనిని-

*క॥ వినుఁడీ కృతి ముప్పదియొక*
*దినమునకుం జెప్పినాఁడ దేవుని యానన్*
*జనులెన్న ఁగుక్కుటేశ్వరు*
*ఘనకరుణాదృష్టివలన ఁగవివరులారా!* *(శివ 2-194)*

– అని స్వామి ఆజ్ఞవలన 31 రోజులలో వ్రాశానని కావ్యము చివర చెప్పాడు. ఇందులోని కథ సంగ్రహముగా ఇది –

ఒకనాడు అర్జునుడు తన తాత భీష్ముని దగ్గరకు వచ్చి–'తాతా! నువ్వెరుగని కథలు లేవు. విష్ణుపాదమున పుట్టిన గంగను శివుడునెత్తిన ఎలాపెట్టుకొన్నాడు. కొందఱామెను జాలరి కన్య అంటారు. నువ్వు ఆమె కొడుకువు గదా! ఆమె కథ చెప్పు' – అని అడిగాడు. అప్పుడాయన నేను ఇంతకుముందు నారదునివలన విన్న కథను చెబుతాను, వినుమని ఇలా చెప్పాడు –

విష్ణువు నీటిని పుట్టించి అందులో వీర్యము వదిలిపెట్టాడు. అది అఖండమైనది. ఆయన అందులో జీవరాసులను సృష్టించి వృద్ధిచేస్తున్నాడు. మూషికాసురుడనే రాక్షసుడు ఆ అండములో దూరి తూటుపొడిచాడు. అందువలన నీళ్ళు(గంగ) ఉధృతంగా పాతి జీవులను ముంచెత్తాయి. ముప్పు తొలగించదానికి శివుడు ఆ నీటిని జటాజూటములో ధరించాడు. అందులో పట్టని గంగ ఉప్పొంగి పెద్దనదియై హాని కల్గిస్తూ బ్రహ్మాండ

రంధ్రము గుండా పాతింది. అప్పుడు విష్ణువు మూషికుడిని చంపి తన కాలివ్రేలు ద్వారా ఆ రంధ్రాన్ని మూశాడు. దాని సందునుండి ఊట కొంచెము లోపలికి ప్రవహించింది. ఆ గంగా ప్రవాహమే సముద్రమై జగాలను ముంచెత్తి తన కెదరులేదని గర్వించింది. దాంతో కోపించిన శివుడు – 'గర్వించిన బ్రహ్మాదులే ఇంతకుముందు నా వలన భంగపడ్డారు. ఆడుదానివి నీ కింత గర్వమా! వెళ్ళి భూలోకములో బెస్తవారి కులములో పుట్ట' – మని శపించాడు. గంగ తప్పు తెలుసుకుంది. నిన్ను విడచి క్షణము కూడ ఉండలేనని ప్రాధేయ పడింది. స్వామి కరుణించాడు. నువ్వు కొన్నాళ్ళు అక్కడ ఉన్న తరువాత నిన్ను పెళ్ళి చేసికొని నా దగ్గరకు తెచ్చుకుంటానని పరిహారము చెప్పాడు.

గంగ జాలరిపాప రూపము ధరించి భూమికి వచ్చి, ఏలూరు నగరములో ఉన్న సముద్రపు ఒడ్డున శివునిగురించి తపస్సు చేయడం మొదలుపెట్టింది. అప్పుడు శంఖ దేవుడనే జాలరి తన బంధువులతో అక్కడకు వేటకు వచ్చి ఆమెను చూచి 'ఎవరమ్మా... నీవు...?' – అని వివరాలడిగాడు. అప్పుడామె – 'తండ్రీ! నేను గంగను. శివుడు ఒకానొక కారణమువలన కోపించి జాలరికన్యవై పుట్టమని శపించాడు. అందువలన ఇలా అయ్యాను. తల్లివైనా తండ్రివైనా నాకిక నీవే, ఎలా సాకుతావో'–అని అన్నది. అందుకాయన– 'అమ్మా! మా ఇంట్లో అన్ని సంపదలున్నాయి. నిన్ను కన్నబిడ్డలాగా చూసుకొంటాము, రామ్మా!' అని తీసికొనిపోయి భార్య చక్రమదేవి కిచ్చాడు.ఆ దంపతులిద్దరు ఆ బిడ్డను అల్లారుముద్దుగా పెంచుకోసాగారు. స్నేహితులతో బొమ్మపెళ్ళిళ్లు, గుజ్జనగూళ్ళు ఆడుతూ క్రమంగా గంగ పెద్దదయింది. యౌవనము వచ్చింది.

ఒకనాడు శివపార్వతులు కైలాసములో బ్రహ్మాది దేవతలతో కొలువుదీరారు. అప్పుడు నారదుడక్కడికి వచ్చి స్వామిని స్తుతించాడు. స్వామి కుశల ప్రశ్నలు వేసాడు. ఆ తర్వాత– 'నారదా! నీవు అన్ని లోకాలకు వెళుతుంటావు కదా! అక్కడి విశేషాలను చెప్ప' మని అడిగాడు. అప్పుడు నారదుడు – 'స్వామీ! భూలోకములో ఏలూరు పట్టణమున్నది. అక్కడ ఒక జాలరి కన్యను చూసాను. ఆమెకు అందములో ఎవరూ సాటిరార'ని ఆమెను వర్ణించాడు. నా మాటలకేమిగాని ఆమె మీకే తగునని చల్లగా స్వామిలో మరులు రేకెత్తించాడు.వెంటనే స్వామి కొలువు చాలించి, పార్వతీదేవిని అంతఃపురానికి పంపించాడు.

జడలు చిక్కులుదీసి నడినెత్తిన సిగవేసి సంపంగి పూలదండ చుట్టి అందమైన జంగము వేషం ధరించి శివుడు ఏలూరు వచ్చాడు. అక్కడ ఉద్యానవనంలో తిన్నెమీద కూర్చున్నాడు. ఇంతలో స్నేహితురాండ్రతో బాగా ముస్తాబై గంగ విహారానికి వచ్చింది.

పుష్పాపచయము చేస్తున్నప్పుడు శివుడు చూశాడు. మనసు పారేసుకున్నాడు. ఆమె అందాన్ని నఖశిఖపర్యంతము వర్ణించాడు. మెల్లగా దగ్గరకు వచ్చాడు. 'ఎవరు నీవు...? ఇలా పూలు కోస్తుంటే శరీరం కందిపోదా...? ఆ పూలెందుకు...? మన్మథపూజకా...? లేక శివుని పూజకా...? లేక పాన్పును అలంకరించడానికా? ఇంకా ఏ పూలు కావాలో చెప్పు. నేను కోసి ఇస్తాను అయ్యో! అలసిపోయావే, ఉండు విసురుతాను. నన్ను పరాయివాడనుకోకు. ఇదిగో తాంబూలము తీసికో' – అంటూ దగ్గర కాబోయాడు. అంతా విన్నది కాని గంగ ఏమీ మాట్లాడలేదు.

అప్పుడామె చెలులు – 'ఏరా! ఆడవాళ్ళ వెంటపడతావా పో' – అన్నారు. శివుడు పట్టించుకోలేదు. గంగను బ్రతిమాలాడు. ఆమె ప్రక్కకు పోబోతే దారికడ్డంగా నిలిచాడు. పైటలో దాగిన ఆమె వక్షోజాలను చూచే కోరికతో – 'మావి చిగురదిగో, అందుకో' – అన్నాడు. ఈ విధంగా ఆటపట్టిస్తున్న ఈశ్వరునితో చెలులు – 'ఈ వేషముతో ఇంతకు ముందు ఎంతమందిని మోసం చేసావో! నీ ఆటలు మా దగ్గర సాగవు. జోగులెక్కడ, ఇల్లాలి బోటు లెక్కడ? పో' – అని ఈసడించారు. అప్పుడు శివుడు – 'నిన్ను పువ్వుల్లో పెట్టుకొని చూసుకొంటాను' అని గంగను ప్రాధేయపడ్డాడు. గంగ మాట్లాడలేదు. అప్పుడు చెలులు – 'జంగమదేవరవని ఊరుకుంటున్నాము. ఒళ్ళు కొవ్వెక్కి మా చెలిమీద కన్నేసి ఇలా మాట్లాడతావా! మా వాళ్ళు వింటే జంగమదేవరవని కూడ చూడరు' – అని హెచ్చరించారు.

అప్పుడు శివుడు–ఇన్నిరకాలుగా వేడుకుంటుంటే మమ్ముల ఇరువురినీ కలుపకుండా గొడవపడతారా? వెన్నెలలో మీ చెలి విరహంలో పడితే మీరు కాపాడగలరా! అని, గంగతో – యిన్నిసార్లు బ్రతిమాలించుకొన్నావు. నీకు నిలువెల్లా విషమే. నా మాట వినకపోతే భంగపడతావు' – అన్నాడు. గంగ నవ్వు నాపుకొని, 'నువ్వు సర్వజ్ఞుడివి, నిన్ను కాదనేవారు భూమిలో ఎవరైనా కలరా' అన్నది. అప్పుడు చెలులు జంగం జోలి నీకెందుకని గంగను తీసికొని ఇంటికి వెళ్ళారు. ప్రథమాశ్వాసము ముగిసింది.

చీకటి పడింది. వెన్నెల వచ్చింది. ఈశ్వరుడు గంగను మరచిపోలేక పోయాడు. అనవసరంగా పోనిచ్చానే అని బాధపడ్డాడు. విరహంలో పడ్డాడు. చంద్రుడిని, మన్మథుడిని దూషించాడు. అక్కడ గంగ కూడ విరహంలో పడింది. నులకమంచం మీద పడుకొని నిట్టూర్చింది. 'ఎందు కక్కడికి వెళ్ళాను? జంగమదేవర నెందుకు చూశాను? అతనితో కూడక ఎందుకు వచ్చాను?' – అని బాధపడింది. అది చూసి ఆమె స్నేహితురాళ్ళు

జంగమదేవర మందు పెట్టాడేమోనని అనుకొన్నారు. గంగతో – 'ఏమే సిగ్గులేకుండా ఉన్నావు? ఆ జంగమదేవర ఏమి చేసాడే? తల్లిదండ్రులు, పెద్దలు, చుట్టాలు ఇది వింటే తప్పు కదా! బిచ్చ మెత్తుకునే జంగమదేవర కోసము ఇలా బాధపడతారా' – అని బుద్ధులు చెప్పారు. అప్పుడు గంగ 'నా జంగమస్వామిని తెచ్చి నా విరహ' బాధను అపండి. మీకు నగలు, పట్టుబట్టలు ఇస్తాను. లేదంటే పోండ'ని తిట్టింది. వాళ్ళు ఒకళ్ళ ముఖాలు ఒకళ్ళు చూసుకొన్నారు. గుసగుసలు పోయారు. ఈసడించారు. మిడిమేలమని వెళ్ళి పడుకొన్నారు.

గంగ ఒక్కతే ముసుగు వేసికొని ఆ రాత్రి జంగమస్వామి కోసం ఉద్యానవనానికి వచ్చింది. అంతా వెతికింది. చెట్లను గుట్లను అడిగింది. నన్ను విడచిపోవుట భావ్యమా అని శివుని గురించి బాధపడింది. 'చంద్రా! నువ్వు నేను స్వామి శిరస్సుమీద కలసిమెలసి ఉన్నాము. ఇప్పుడు నన్ను వేధించుట న్యాయమా' అని విరహవేదన అనుభవించింది.

ఇక్కడ ఇంట్లో చెలులు గంగకోసం అంతా వెతికారు. శృంగారవనానికి వచ్చి మదనవేదనపడుతున్న ఆమెను చూసారు. 'ఈ విధంగా ఒంటరిగా రావచ్చునా...? విరహులను శృంగారవనము నిలువనిస్తుందా...? ఇంటికి వెళదాం రా...!' – అని ఊరడించి తీసికొనివచ్చారు. తెల్లవారింది. తండ్రికీ విషయం తెలిసింది. 'ఈ విధంగా చేయడం తగునా? ఊరి పెద్దలకు తెలిస్తే వెలివేయరా...! మంచి సంబంధం చూసి పెళ్ళి చేస్తాను' – అన్నాడు. అప్పుడు గంగ – 'నేను మానవ కన్యను కాను. గంగను. ఆ జంగమస్వామి ఎవరో కాదు ఈశ్వరుడు. నువ్వు ఎంత గొప్పవాడిని తెచ్చినా నేను చేసికోను'– అని చెప్పింది. శంఖదేవుడు సంతోషించాడు. అదే నిజమైతే స్వామి తన నిజరూపం చూపించి దేవతలతో ఇంటికి వస్తే, పెళ్ళి చేస్తానన్నాడు. గంగ స్వామిని ప్రార్థించింది. స్వామి దేవతలతో ప్రత్యక్షమయ్యాడు. శంఖదేవుడు – 'ఈ నీచకులస్థుని ఇంటికి కన్యార్థివై వచ్చావా స్వామీ' అని పులకించాడు. విడిది చూపించాడు. స్వామిని పెండ్లికొడుకును చేశారు. పెండ్లి మంటపములో శంఖదేవుడు స్వామికి కన్యాదానము చేసి శాస్త్రోక్తంగా పెండ్లి జరిపించాడు. అత్తవారింట్లో స్వామి కొన్నాళ్ళు గంగతో సుఖించాడు. ఒకనాడు మామను పిలిచి స్వస్థానానికి వెళతానన్నాడు. అందుకాయన 'దేవా! మా అల్లుడవై ఎప్పుడూ మా ఇంటిలో నిలిచి ఉండాలని మా కోరిక' – అన్నాడు. అందుకు స్వామి దివ్యజలాపహార లింగరూపినై నీ ఇంట్లో ఉంటాను' – అని కరుణించి, దేవతలు కొలువగా కైలాసానికి వచ్చాడు. అంతకుముందే నారదుడు పార్వతీదేవి దగ్గరకు వెళ్ళి ఈ పెళ్ళివృత్తాంతమంతా ఆమె చెవిని వేశాడు.

గౌరికి భయపడి స్వామి గంగను తలపై పెట్టుకొని నగరానికి వచ్చాడు. అంతః పురానికి వెళ్ళాడు. గౌరి తిట్టి తలుపులు మూసింది. ఇది న్యాయమా అన్నాడు స్వామి. 'ఎవరు నీవు, చూడబోతే క్రొత్త పెళ్ళికొడుకు లాగున్నావు' – అన్నది గౌరి. నీలకంఠుడినన్నాడు స్వామి. నీలకంఠుడ (నెమలి) వైతే కేకలు వేసుకుంటూ కొండలలో తిరగమంది. క్రీడా కిరాతుడిని అన్నాడు స్వామి. క్రీడాకిరాతుడ (వేటగాడి) వైతే జింకలను, పులులను వేటాడ దానికి అడవికి వెళ్ళమంది గౌరి. పశుపతి నన్నాడు. ఆలమంద కెళ్ళమంది. ఇలా సంవాదము నడిచాక స్వామి కాళ్ళ బేరానికి వచ్చాడు. ఏ ప్రతిజ్ఞ అయినా చేస్తాను. నన్ను మన్నించమన్నాడు. గౌరి శాంతించింది. తలుపు తీసింది. స్వామి ఒంటిమీది సంభోగ చిహ్నాలను చూసి ఏ పాపమెరుగ నన్నావు...? ఇవేమిటి...?అంది. 'స్త్రీలు గణేశుని పూజ చేశారు. అతను ఆ పసుపు కుంకాలతో నన్ను కౌగిలించుకొన్నాడు. ఆ మరకలివి' – అని స్వామి బదులిచ్చాడు. మోవి మీది గంటు లేమిటని అడిగింది. మన్మథునితో యుద్ధము చేసినప్పుడు చిలుక కొరికిందన్నాడు. ఒంటి కంటుకున్న కాటుక సంగతేమిటన్నది. విషము త్రాగినప్పటి ప్రభావమన్నాడు. ఈ విధంగా క్రాస్ ఎగ్జామినేషన్ జరుగుతూ ఉంటే స్వామి తట్టుకోలేక నన్నుద్ధరించమని దేవేరి పాదాల మీద పడ్డాడు. దేవేరి కరిగింది. విభుని మనోజకేళిలో తేల్చింది. ఇలా అన్యోన్యంగా గడిచిపోయింది.

ఒకనాడు స్వామి గౌరితో పాచికలాడి ఓడిపోయాడు. గౌరి నవ్వింది. ఆమె గర్వాన్ని సహించలేక గంగ స్వామిజడలలోనుంచి తొంగిచూసింది. గౌరి కూడ చూసింది. 'ఏ పాపము ఎరుగనన్నావు, నీ జడలలో నుండి తొంగిచూసిన ధూర్తసతి ఎవరు? అప్పుడు దారుకావనములో ముని భార్యలను భ్రమపెట్టి మోహింపజేసావు. భల్లాణరాజు భార్యను కామించావు. నీ సంగతి తెలియదా...? కులం తక్కువ దాన్ని పెళ్ళి చేసికొని నెత్తిని పెట్టుకున్నావు. దాన్ని క్రిందికి దించి నాతో మాట్లాడించు. అమ్మో! మగవాళ్ళను నమ్మకూడదు' అని నిలదీసింది. గంగకు కోపం వచ్చింది. క్రిందకు దూకింది. 'ఎవతెవే నీవు...? నా భర్త తలపై కెక్కావు, వెళ్ళిపో, లేకపోతే ప్రమథగణముతో గెంటి వేయిస్తాను' – అంది గౌరి. అప్పుడు గంగ, 'అక్కా! ఇంతకుముందు స్వామిని నీవు ఎలా పెళ్ళిచేసికున్నావో నేనూ అలానే పెళ్ళి చేసికొన్నాను. నిన్ను సగము దేహంలో నిల్పుకున్నాడు. నన్ను నెత్తిన పెట్టుకున్నాడు' – అంది. గౌరి వినలేదు. 'ఎప్పుడూ బురదతో, నీటిజంతువులతో ఉండే దానివి నన్నెదిరిస్తావా? – అని మండిపడింది. అప్పుడు గంగ– 'నువ్వు తక్కువా. ఇంతకు ముందు చండికవై కారెనుబోతును చంపలేదా, సత్తివై ఊరూర

కోళ్ళు, గౌరియలను గుగ్గిళ్ళు, కుడుములాగ తినలేదా' అని దెప్పింది. దాంతో ఉగ్రురాలైన గౌరి – 'ఓసి గయ్యాళి! ఎంత రోషమే, చేపలు పట్టేవాడి కూతురివి. నాతో సమానమా' అంది. అప్పుడు గంగ – 'నీ సంగతి చెప్పాలనా! పొద్దుగూకులు కల్లు, గంజాయి, మాంసము తినే తక్కువ కులము వారి ఇంట నువ్వు పుట్టలేదా?' అని ఎత్తిపొడిచింది. ఇలా సవతులిద్దరు దెప్పు కొన్నారు.

గౌరి స్వామితో–'నా మీద కొకదాన్ని తెచ్చి ఇప్పుడు ఏమీ ఎఱుగనివాడిలా ఉన్నావు. నీ సంగతి తెలిసిందిలే' అని కోపించి వెళ్ళబోయింది. అప్పుడు స్వామి – 'తప్పు చేసాను క్షమించు. ఎందఱు భార్యలున్నా నీవే నా పట్టపురాణివి' అని ఆమె పాదాలు మీద పడ్డాడు. బుజ్జగించాడు. కౌగిలించుకొన్నాడు. గంగచేత కూడ మ్రొక్కించాడు. 'ఒక చోట పుట్టి ఒకరినే కట్టుకొన్న మీరు, మీలో మీరు పోట్లాడుకుంటే ఎలా? ఒద్దికగా ఉండాలి' – అని ఓదార్చాడు. గౌరిని సగము దేహములోను, గంగను నెత్తిన పెట్టుకొన్నాడు. దేవతలు కొలువగా స్వామి లోకాలను పరిపాలించడం మొదలుపెట్టాడు' – అని భీష్ముడు ఈ కథను అర్జునుడికి చెప్పాడు. ద్వితీయాశ్వాసము ముగిసింది.

ఈ కథకు మూలము ఏ పురాణములోను కన్పించలేదు. ఇది జానపద గేయాల లోను, కథలలోను, స్త్రీల పాటలలోను కన్పిస్తుంది. ఇతర భాషలలో ఈ కథ ఉందో, లేదో పరిశోధకులు శోధించాలి. ఈ కథను భీష్ముడు అర్జునుడికి చెప్పాడు కనుక భారతంలో ఉందేమోనని తెలుగు భారతంలో వెతికాను. కాని అందులో లేదు. సంస్కృత భారత ప్రక్షిప్త సర్గలలో ఉందేమో శోధించాలి. ఈ కథ తెలుగుదేశములోని ఏలూరు పట్టణంలో జరిగిందని కవి చెప్పాడు కనుక స్థలమాహాత్మ్యకథ అయినా అయి ఉండవచ్చును.

ఈ కథను గంగా వివాహము పేరుతో పసగాడు సన్యాసి (ముసలయ్య, అచ్చమ్మల కుమారుడు) అనే కవి (ఇతడు తిమ్మకవికి సమకాలికుడు) ద్విపదకు దగ్గరగా ఉన్న గేయ ఛందస్సులో రచించాడు. గంగా గౌరీ సంవాదము పేరుతో ఇంకొక పూర్వజానపద కవి కూడ రచించాడు. పసుగాడు సన్యాసి కావ్యము ప్రకారము ఈ కథ ఇంకా ఇలా కొనసాగింది. సవతుల సంవాదము కూడ తిమ్మకవి రచనకు భిన్నంగా ఇలా ఉంది.

*గౌరి : వలపు మందులు పెట్టి వలపించుకొంటివా?*
*గడప దాటని శివుని గయ్యాళి గంప!*

*గంగ : వలపు మందులు చాల గలవు కొండలయందు*
*నీకు పుట్టిల్లది నిజము గౌరమ్మ!*

*గౌరి :* చాపలమ్మే నీవు జాలారి దానవు
నిన్నెట్లు వలచెనే నీలకంఠుండు?

*గంగ :* కులమెంచి తేలేదు గుణమెంచి తెచ్చెనే
జాతు లెన్నగ బోకు సవతి గౌరమ్మ!

*గౌరి :* జాతి తక్కువ దాన జాలారి నా సవతి
యెంత పదవబ్బెనే యింతిరో! నీకు

*గంగ :* జాతి తక్కువ లెంచ చెల్లదే గౌరమ్మ
జాతితో పనియేమి నీతి కారణము.

ఈ విధముగా సవతుల కయ్యము దెబ్బలాడుకొనే వఱకు వెళ్ళాక గౌరి శివునితో 'ఏమీ ఎఱుగనన్నావు, ఇది పెట్టిన మందు తలకెక్కినట్లుంది నీకు, నేను వెళుతున్నాను'- అని వెళ్ళబోయింది. స్వామి ఆమెను బ్రతిమాలి ఆపాడు. అది చూచి గంగ, 'నీవు ఆడుదానికి ఇంత భయపడతావనుకోలేదు? అని అలిగి పుట్టింటికి పోయింది. గౌరిమీద కోపముతో గంగ నదీసముద్రాలన్నింటిలో నీరు ఇంకింపజేసింది. గౌరి స్నానపానాలులేక అవస్థలు పడింది. తప్పు తెలుసుకుంది. స్వామి ఆజ్ఞప్రకారము గంగను ప్రసన్నురాలిని చేసుకొని తిరిగి ఇంటికి తీసికొనివచ్చింది.

ఈ సందర్భములో గంగా గౌరీ సంవాదము వ్రాసిన జానపద కవి ఇంకొక క్రొత్త కల్పన చేశాడు. గౌరి మీద కోపించిన గంగ నీటిని దాచింది. తన కొడుకు వీరభద్రుని పిలిచి నీళ్ళెక్కడున్నాయో చూచి రమ్మని పంపింది.

"ఉదకాల జాదలు చూచిరా కొడుకా
అటుబోయి వీరన్న ఆ కొలను జూచె
ఆ కొలను ఉదకాలు దాచింది గంగ
ఇటుబోయి వీరన్న ఈ కొలను జూచె
ఈ కొలను నీరంత దాచింది గంగ
చిలుక సముద్రము జూడ చిన్నమెత్తు లేవు
పాలసముద్రము జూడ పాతికెత్తు లేవు
ఎచ్చట తిరిగినా ఉదకంబు లేదు
విభూతి గుండాన ఇంకిపోయినవి
సవతుల గుండాన సురిగి పోయినవి

*కాశి కావడి గట్టి గంగకే బంపె*
*గంగలో ఉదకాలు కానరావాయె"*

ఈ స్థితి వినగానే గౌరికి కోపం వచ్చింది. గంగ కీ అధికార మెవరిచ్చారని గద్దించింది. ఐదు రోజులనుండి స్నానం లేదు. ఆఱు రోజులనుంచి శివపూజ లేదని బాధపడింది. గంగకు ప్రతీకారం చెయ్యాలనుకుంది. పదివేలపాలకావిళ్ళు, పదివేల నేతి కావిళ్ళు కట్టించింది. వాటితోనే స్నానం చేసింది. శివపూజ చేసింది. పాపం వెంటనే గౌరిని- *"చీమలు దోమలు చెదగుట్టసాగె*
*గండుచీమలు మేను చెండుతూ వుండె"*

వాటి బాధపడలేక వృద్ధ గౌతమిలోని జలాలకోసం 'పంచవటి దాకపోయిరా కొడుకా' - అని పంపింది. ఫలితం లేదు. స్వామికొఱకు కొడుకును పంపింది. అప్పుడు స్వామి-

*"పుట్టించ గిట్టించ శివుడు కర్తగును*
*నోచిన నోములకు గౌరి తా కర్త*
*యే ప్రొద్దు గంగతో యెదురు వాదమ్ము*
*కూడదని చెప్పుమీ ఆ గౌరితోడ*
*గంగ సమ్మతిచేత ఘన ఉదకమొచ్చు*
*నదులన్ని నిధులౌచు నిండుండు నయ్యా*
*స్నానపానమ్ములు సకల జపములును*
*నీరుంటె నెరవేరు"* - అని చెప్పి పంపాడు.

గౌరి గర్వం తగ్గించుకొని వీరన్నను తీసికొని గంగమేడకు వెళ్ళింది. గంగ తక్కువ తిన్నదా -

*"గౌరమ్మ రాకలు గంగప్ప చూసి*
*పచ్చి చేపలు దెచ్చి పందిళ్ళు వేసె*
*పండుటాకులు దెచ్చి తోరణాల్ గుచ్చె*
*పెద్ద చేపలు పంచటరుగులను గట్టి*
*కప్ప వచ్చిన నీళ్ళు కళ్ళాపు జల్లె"*

ఇలా గౌరికి ఘన స్వాగతం పలికింది. వచ్చిన పనేమిటక్కా? అని అమాయకంగా అడిగింది. అమె చెప్పింది ఆ నీళ్ళ జాడ నాకు తెలియదంది గంగ. దాంతో ఖంగుతిన్న గౌరి తన కొడుకులను, చీరలను, నగలనూ ఇస్తానని ఆశపెట్టింది. నీ కొడుకులు నా

కొడుకులే. చీరలూ, నగలూ తనకూ ఉన్నాయన్నది గంగ. ఇక లాభం లేదనుకొని గౌరి నా శివుణ్ణి నీకిస్తానంటుంది. వెంటనే గంగ–'ఇప్పుడన్న మాటలు తప్పకుమి అక్కా'–అంది. వెంటనే ఇందుకు సాక్ష్యమెవరని అడిగింది.

"భూమి ఆకాశము ఆ రెండు సాక్షి
మద్దులు మారేళ్ళు అవి రెండు సాక్షి
సకల దేవతలును వారెల్ల సాక్షి" – అని గౌరి అంది. దాంతో గంగ సంతోషించి, నదులు ప్రవహించేలా చేసింది. గౌరి స్నానం చేసి శివపూజ చేసింది. గంగ స్వామితో 'ఈశ్వరా! గౌరప్ప ఇచ్చెను నిన్ను' – అని మురిసిపోయింది.

ఈ జానపద కథలోని గంగాగౌరి సంవాదము సవతుల కయ్యంలాగ హీనస్థితికి దిగజారింది. ఉదాత్తమైన పాత్రలు ఇలా దిగజారి పోట్లాడుకోవడమును విజ్ఞులు హర్షించ లేదు. కాని జానపద కథలకు జీవనాడి లోకసహజమైన ప్రవర్తన. గంగాగౌరులను దివ్యలుగా కాకుండ సామాన్యపాత్రలుగా ఊహించుకొంటె ఈ కయ్యం సజీవమై మనోహరంగా ఉంటుంది. జానపదకవి కవిత్వపుపోకడలు కూడ మనసును రంజింప చేస్తాయి. అందువలననే ఈ రహస్యము తెలిసిన తిమ్మకవి జానపద కవి పొంతపోకుండా, మితంగా ఉదాత్తంగా శ్లేషలతో నిర్వహించి రసభరితం చేశాడు. స్త్రీ సహజమైన అసూయను జానపద కవిలా పొడిగించకుండా పొడిపొడిగా తడిమాడు. గంగా గౌరి సంవాదమును తిమ్మకవి శ్లేషలతో నడిపిన తీరును చూడండి.

ఆ.వె. *అడుగు నిలుప నీక వడికొట్టు చూపుచు*
*నింగి ముట్టి మిగుల ఁబొంగెదేమి*
*గట్టివాతనంబు గనబడ నౌనె నీ*
*నిలువు నీరుగాను నీచురాల.* (2–173) అని గౌరి గంగను అంటుంది.

'నీచురాల! అడుగు నిలుపకుండా నోరు పెట్టుకొని ఇంత్తెత్తున ఎగురుతూ మిడిసి పడతావేమిటి? నీ నిలువెల్ల నీరుగాను (అంటే నువ్వు నాశనమైపోను)' అని సామాన్యార్థము.

'గంగ ప్రవాహము కనుక ఒకచోట నిలువకుండా వేగంగా, దుడుకుగా ప్రవహిస్తుందని, ఆకాశగంగ కనుక నింగి ముట్టి పొంగుతుందని, నీ నిలువు (శరీరము) అంతా నీరేనని, నీచురాల! (నిల్వఉన్న నీటి వాసన కలదానా)' – అని గంగానదిపరమైన శ్లేష. ఇంకొక పద్యంలో గౌరి ఇలా అంటుంది.

గీ. నిచ్చ నిచ్చలు పంకంబు నివ్వటిల్లఁ
గోరి మితిలేని జలచర కోట్లలోన
నడచి కొనియుండు చెనటు వయారె నీవు
నన్ను నెదిరింప నెట్టి దానవె తుటారి. (2-177)

ఇందులో బెస్తకులానికి, గంగకు శ్లేష 'ఒళ్ళంతా బురదకాగ, ఎప్పుడూ జలచరాలతో సంచరించే చేపలుపట్టు తక్కువ కులానికి చెందినదాన' అని సామాన్యార్థము. 'ఎప్పుడూ ఒంటినిండా ప్రజలు వదిలించుకొన్న పంకము (పాపము) కలిగి ఉండగా రకరకాల జలచరాలను కల్గి ఉండుదానా' – అని గంగానదిపరమైన శ్లేష. ఈ విధంగా గంగా గౌరీ సంవాదము ఆద్యంతము శ్లేషలతో నిర్వహించబడింది.

పరమేశ్వరుడు గంగ కోసము జంగమరూపములో భూమికి వచ్చి ఉద్యానవనములో ఆమెను కలసి, తనను కూడమని అడుగునప్పుడు, తన గురించి చెప్పుకొన్న మాటలను కూడ కవి శ్లేషలతో నిర్వహించాడు.

క. వెండియు ఁబైఁడియు నాయెడఁ
కొండలవలె నుండు మెండుకొని యెప్పుడు నో
యండజగామిని! చూడ న
ఖండ మహోన్నత విభూతిఁ గలవాఁడఁ జుమీ (1-131)

నా దగ్గర కొండంత వెండి, బంగారము ఉన్నాయి. నేను చాలా సంపద కలవాడినని జంగమపరమైన అర్థము. వెండియు, పైడియు తడబడ దాన్ని అధిక సంపదలున్న దానికి సంబంధించిన పలుకుబడి. దీనిని చేమకూర వేంకటకవి (విజయ విలాసము), మడికి సింగన (పద్మపురాణము) ప్రయోగించారు.

నా వద్ద వెండి, బంగారు (కైలాసము, మేరు పర్వతములు) కొండలున్నవని, అఖండమైన విభూతికలవాడనని (సంపదలు మరియు తెల్లబూడిద) శివునిపరమైన శ్లేష.

గీ. ఎండ కన్నును నీడక న్నెఱుగకుండ
గరిమ నుండుదు ఁదలపువ్వు గందకుండ
నెలఁత నన్నేలు చిరసుఖాన్వితుని జేసి
నిన్ను నే ప్రొద్దు ఁదలమీఁద నిలుపుకొందు (1-132)

తిమ్మకవి సార్వభౌముడు ఇందులో జాతీయాలు పలుకుబడుల ద్వారా శ్లేష సాధించిన తీరు అద్భుతము. ఎండ కన్ను నీడ కన్ను ఎరుగకుండా, తలపువ్వు వాడకుండా

హాయిగా జీవిస్తున్నాను. నన్ను బాగా చూసుకుంటే నిన్ను నెత్తిన పెట్టుకొని చూసుకుంటానని జంగమపరమైన అర్థము.

ఎండ కన్ను అంటే సూర్యుడు, నీడ కన్ను అంటే చంద్రుడు. స్వామికి ఒక కన్ను సూర్యుడు, ఇంకొక కన్ను చంద్రుడు. వీరిగతులు చెడకుండా, తలపువ్వు (నెలవంక) కందకుండా గొప్పగా బ్రతుకుతున్నాను. నన్ను సుఖాలతో చూసుకుంటే నేను ఎప్పుడూ నెత్తిన (గంగ స్వామి నెత్తిపైనే ఉంటుంది కనుక) పెట్టుకొంటాను అని శివపరమైన అర్థము. తానెంత వేడుకొన్నా గంగ స్పందించకపోవడముతో ఈశ్వరుడు నిష్ఠూరాలాడాడు. అందులో కూడ శ్లేష బాగా కుదిరింది.

క. *పలుమాఱు బతిమాలిన లోఁ*
*గలఁక వహించుకొని లోతు గనబడ నీ కీ*
*మలఁకలఁ బెట్టెదు నీకు*
*న్నిలువెల్ల విషంబు గదవె నీరజగంధీ!* (1-154)

'ఎన్నిసార్లు బ్రతిమాలినా నీ అంతరార్థము తెలియనీక వంకలు పెడుతూ బాధపెడుతున్నావు. నీకు ఒళ్ళంతా విషమే గదే నీరజగంధీ' - అని సామాన్యార్థము.

లోతు కనబడనీక, (జనులు వదిలించుకొన్న) పాపాలను లోపలపెట్టుకొని మెలికలు తిరుగుతూ ప్రవహిస్తావు. నీకు ఒళ్ళంతా విషమే (నీళ్ళే) గదా! అంటే నీరే నీ దేహమని అనుట. నీరజగంధీ అంటే పద్మముల వాసన కలదానా! పద్మాలు కూడ నదిలోనే పుడతాయి కనుక ఆ వాసన కలిగినదానా అనుటలో సాభిప్రాయము-అని గంగానదిపరమైన అర్థం.

శివుని మాటలకు గంగ కూడ శ్లేషలోనే జవాబు చెప్పింది.

క. *భళి భళి! సర్వజ్ఞుఁడవే*
*పలుకుల కింకేమి లాతి పడుచుల వెంటన్*
*వలగొని తిరిగెదు నిన్నీ*
*యిల ఁగాదనువారు లేరె యెంతటి వారున్.*

గీ. *పరసతీ లోలుఁడవు నీవు పాళిమీఱ*
*నచల సంస్థితి సానుల నంటి తిరుగఁ*
*జెల్లుగా కిట్టు లిల్లాండ్ర ఁజేరి మెలగఁ*
*జనునె నీ నెయ్యమిఁక ఁజాలుఁ జాలు ఁబొమ్ము* (1-157, 158)

'పర స్త్రీలోలుడివి. నీవు సానివాళ్ళనంటి తిరిగితే సరిపోతుంది గాని ఇల్లాండ్రతో మెలిగితే చెల్లుతుందా? నీ ప్రేమ లింక చాల్లే పో' - అని సామాన్యార్థము.

'నాకు పరాయిదైన సతీ (పార్వతీదేవి) లోలుడవైన నీవు అచల సంస్థితి సానుల (కైలాస పర్వతము చరియల) నంటి తిరగాలి గాని ఇల్లాండ్రతో పని ఏమిటి? నీ స్నేహమింక చాల్లేపో' - అని అంతరార్థము.

నారదుడు గౌరికి, గంగాశివులు వివాహవృత్తాంతము చెవిని వేశాక జరిగిన శివపార్వతుల సంవాదమును (2-127 నుండి 135 వరకు పద్యగద్యాలు) కూడ కవి శ్లేషతో నడిపించాడు. ఇది చాలా సరసమైన ఘట్టము. గంగాదేవి జన్మవృత్తాంతము ఈ కావ్యంలో ఒక విధంగా ఉంటే, ఏనుగు లక్ష్మణకవి వ్రాసిన **జాహ్నవీమాహాత్మ్యములో** ఇంకొకరకంగా ఉంది. జాహ్నవీ కావ్యము ప్రకారము గంగాదేవి జన్మవృత్తాంతము ఇలా ఉంది. గౌరీశంకరుల పెండ్లి జరుగుతున్నప్పుడు, బ్రహ్మ పార్వతి కాలిబ్రొటనవ్రేలు అందాన్ని చూచి మదనపరవశుడయ్యాడు. అప్పుడు అతని వీర్యం నేలపై పడింది. బ్రహ్మ సిగ్గుపడి దానిని కాలితో రాచాడు. అందులో నుండి శక్తిమంతులైన వాలఖిల్యులు పుట్టారు. అది చూచి మునులందరూ బ్రహ్మను నిందించారు. బ్రహ్మ సిగ్గుతో పెండ్లి మండపమునుండి వెళ్ళిపోయాడు. పరమేశ్వరుడు దయాసముద్రుడు కనుక నందిని పిలిచి బ్రహ్మను తీసికొనిరా. అతనిని నిరపరాధిని చేసి కరుణాస్తానన్నాడు. బ్రహ్మ వచ్చాక శివుడు పాపాలన్నిటిని పోగొట్టే నీరు, మట్టితో నీ పాపము పోగొడతానన్నాడు. మట్టితో కమండలము చేసి, అన్ని జలాలలో కెల్లా శ్రేష్ఠమైన వాటిని ఆహరించి, ఆ నీటితో కమండలము నింపి మంత్రించాడు.

*గీ. ఉత్తమంబులు పృథివియు నుదకములును*
*గమలసంభవ! పంచభూతములయందు,*
*పూనుమెపుడు తత్సారభూతమైన*
*యిమ్మహాపాత్ర నానంద మెసక మెసఁగ* (జాహ్నవీ 1-175).

కమండలములోని గంగ ప్రభావమువలన చిత్తచాంచల్యమువలన పుట్టిన పాపము నశిస్తుంది. ఈ కమండలాన్ని ధరించు, పరిశుద్ధుడవవుతావని శివుడు బ్రహ్మకు చెప్పాడు. ఈ విధంగా గంగ పుట్టుకకు శివుడు కారకుడుగా ఏనుగు లక్ష్మణకవి చెప్పాడు. అయితే ఈ కథ తాను ఏ పురాణము నుండి తీసికొన్నాడో కవి చెప్పలేదు. ఇది ఇంకా పరిశోధించవలసిన విషయము.

ఇక శివలీలావిలాసములోని పురాణాంశాలను పరిశీలిస్తే కొన్ని ఆసక్తికరముగా కన్పిస్తాయి. శైవపురాణరహస్యమర్మజ్ఞుడైన తిమ్మకవి శివకేశవుల కభేదము పాటించినప్పటికీ నారదునిచే చేయించిన శివస్తుతిలో శివాధిక్యమే కన్పిస్తుంది.

గీ. *భైరవాకృతియును వీరభద్రమూర్తి*
*శరభసాళువరూపంబు సరవిఁ దాల్చి*
*నలినభవదక్షనారసింహులశిరంబు*
*లేపు మీఱంగ ఁదునుమవె యీశ! నీవు* (1-62)

బ్రహ్మ, దక్షుల శిరస్సులను ఈశ్వరుడు ఖండించుట అందరికీ తెలిసినదే. కాని నృసింహమూర్తిని చంపినట్లు కన్పించదు. నృసింహావతారము ముగిసినాక నృసింహుడు విజృంభించి తిరుగుతూ ఉంటే, శివుడు శరభరూపములో అతనితో పోరాడి, చంపి, ఆ చర్మము తీసి తాను కప్పుకొన్నాడని, తర్వాత నరరూపము నరుడుగాను, మృగరూపము నారాయణుడయ్యారని తామసవర్గానికి చెందిన శివపురాణము చెబుతుంది.

నృసింహ, శరభులు హోరాహోరిగా యుద్ధం చేస్తున్నప్పుడు బ్రహ్మవారిని ప్రస్తుతించి, శాంతింపజేసి, అవతారములను శాంతింపజేశాడని రాజసవర్గానికి చెందిన నృసింహ పురాణము చెబుతుంది. కాని శివకవులు శివపురాణాన్నే ప్రమాణంగా తీసికొన్నారు. తిమ్మకవి నారదునిచే చేయించిన శివస్తుతిలో శ్రుతుల రహస్యాలను పొందుపరచాడు.

సీ. *మహిమ మీఱఁగ సర్వమంత్రరాజంబైన గాయత్రి కీవె పో నాయకుఁడవు*
*శ్రుతు 'లేక యే వ రుద్రో న ద్వితీయ' యం చనిశంబు నిన్నెకా వినుతిసేయుఁ*
*బ్రత్యహంబును 'శివాత్పరతరం నాస్తి' యంచలర స్మృతుల్ నిన్నె తెలుపుచుండుఁ*
*బురుషోత్తమఖ్యాతిఁ బరగు వెన్నుఁడు వేయి రాజీవముల నిన్నె పూజసేయు*

గీ. *జలజగర్భుండు మొదలు జంతువులకుఁ*
*బతివగుట ఁజేసి నీకె విశ్రుతముగాఁగఁ*
*బశుపతి సమాఖ్య చెల్లె నబ్బురము మీఱ*
*నిన్ను కొనియాడ నెవ్వరు నేర్తు రభవ.* (1-57)

ఈ స్తుతిలో కొన్ని పద్యాలను ఏకంగా దేవభాషలో వ్రాయడం తిమ్మకవి ఉభయ భాషాపాండిత్యానికి నికషోపలము. వంగ, ద్రవిడ భాషలలో కవిత్వము చెప్పగలిగిన తిమ్మకవి ఆ పాండిత్యాన్ని ఇందులో చూపించలేదు.

కవి ఎంతో ప్రజ్ఞతో చెప్పిన ఈ కావ్యములో ఔచిత్యపరంగా కొన్ని లోపాలు కన్పిస్తున్నాయి. ఈ కథను భీష్ముడు అర్జునునికి చెప్పాడు. చెప్పింది తన తల్లి అయిన గంగాదేవి కథను. ఆమె యౌవనాన్ని వర్ణిస్తున్నప్పుడు కథ చెబుతున్నది ఆమె కొడుకు భీష్ముడన్న సంగతి మరచిపోయి తిమ్మకవి ఆమె పైటచాటు అందాలన్నీ ఏకరువు పెట్టాడు. తల్లి అందాలు కొడుకు చూపించడము సభ్యత అనిపించుకోదు. కైలాసంలో కొలువున్న ఈశ్వరుని నిండు సభలో నారదుడు గంగ అందాలను వర్ణిస్తాడు. ఇదిలా ఉంటే ఊరిలోని రసికులు వేశ్యను పొగడినట్లు ఆమె అందాలను పొగడుతారని (1-79) ఇంకొకచోట చెప్పాడు. ఉదాత్తమైన స్త్రీపాత్రను ఇవి న్యూనపరచినప్పటికీ నాటి ప్రబంధాలలో ఇటువంటివి సహజమైపోయాయి. తారాశశాంకము, అహల్యాసంక్రందనము, రాధికాసాంత్వనము వంటి మితిమీరిన శృంగారప్రబంధాలు వచ్చినకాలములో తిమ్మకవి హద్దులు మీరని కావ్యాలు వ్రాసినందుకు అభినందించాలి.

తిమ్మకవి తొలి కావ్యాలలో వ్యాకరణదోషాలు అక్కడక్కడా కనిపిస్తాయి కాని, తర్వాత కావ్యాలలో అంతగా కనిపించవు. ఈ కావ్యములో 'చేతును' అన్నరూపము ఐదుచోట్ల (1-19,37, 2-84,92,138) ప్రయోగింపబడింది. వ్యాకరణము దీనిని అంగీకరింపక పోయిననూ నాటి కవులలో ఈ ప్రయోగాన్ని చాలామంది చేసారు. ఇంతకు మించి వ్యాకరణ విశేషాలు కన్పించవు.

నెలరోజులలో ఇంత చక్కని కావ్యం వ్రాయడానికి కవికి ఎంతో ప్రజ్ఞ ఉండాలి. శబ్దాలంకారాలు లేకుండా ధ్వనిగతమైన శ్లేషలు చెప్పడం సామాన్యమైన విషయం కాదు. అందుకే తిమ్మకవి కవిసార్వభౌముడయ్యాడు. సాహిత్యములో శాశ్వతుడయ్యాడు.

ఈ కవి కాలములో పరాసులకు, అంగ్లేయులకు తరచుగా యుద్ధాలు జరుగుతు ఉండేవి. తన గ్రామ సమీపమునుండే సేనలు తరచుగా రాకపోకలు చేయడమువలన వారికి మార్గసౌకర్యాలు, ఆ గ్రామకరణముగా ఉన్న తిమ్మకవి చేయవలసివచ్చేది. ఆ సేనల దాడులు కూడ ఎక్కువగా ఉండడమువలన చివరి రోజులలో తిమ్మకవి చంద్రమపాలెము వచ్చాడు. భార్య చనిపోయింది. బిడ్డలు లేరు. వృద్ధాప్యములో ఉన్న తిమ్మకవిని తమ్ముడు జగ్గకవి చేరదీసాడు. వ్రాసే కలము ఊరుకోక కుక్కుటేశ్వరశతకం ప్రారంభించాడు. అది పూర్తికాకుండానే శివసాయుజ్యం పొందాడు. స్వస్తి!

- ఉన్నం జ్యోతివాసు,
వేములపాడు.

శ్రీః

శ్రీ కూచిమంచి తిమ్మకవి విరచిత

# శివలీలావిలాసము

## ప్రథమాశ్వాసము

### ప్రార్థన

ఉ. శ్రీనగజాఘనస్తనవిస్ఫుత్వరసంకుమదైణనాభిపం
కానిశవాసితస్ఫుటభుజాంతరుఁ డిందుసుధాపయస్పధృ
గ్భానుతకీర్తిపీఠపురకుక్కుటలింగమహాప్రభుం డశే
షానతభక్తపాలనపరాయణుఁ డీవుత మా కభీష్టముల్. 1

క. మగనిసగమేన నెలకొని,
ముగురంబలయందు నాదిమూలం బగుచున్
జగ మేలుసర్వమంగళ,
జగమే లిడుఁగాత మాకు సమ్యక్కరుణన్. 2

ఉ. శ్రీరమణీరమేశ్వరులఁ జిత్తమునం గదియించి భారతీ
సారసగర్భుల న్మిగుల సంస్తుతిఁ జేసి మతంగజాననున్
సారతఁగొల్చి దెందులురిసత్కులపావను లింగనార్యు నిం
పారఁ దలంచి మున్నిటి మహాకవుల న్వుతియించి వేఁడుకన్. 3

### కవివంశాభివర్ణనము

సీ. కౌండిన్యగోత్రవిఖ్యాతుండఁ గూచిమంచ్యన్వయాంభోధినీహారకరుఁడ
గంగనమంత్రిశేఖరునకు నంగనామణి యగు లచ్చమాంబకును సుతుఁడ
బహుకార్యనిర్మాణబంధురప్రతిభుండఁ గుక్కుటేశ్వరకృపాకూరలబ్ధ
సత్కవితామహాసామ్రాజ్యభారధౌరేయుఁడ బుధజనప్రియచరితుఁడ

తే. దెందులూరి లింగ నారాధ్యదేశికేంద్ర
దత్తమాహేశ్వరాచార్యవృత్తిరతుఁడఁ
గందరాడఘనగ్రామమందిరుండఁ
దిమ్మకవిచంద్రుఁ డనుజగద్వినుతయశుఁడ. 4

సీ. ప్రౌఢి మై రుక్మిణీపరిణయంబును సింహశైలమాహాత్మ్యంబు నీలపెండ్లి
కథయును రాజశేఖరవిలాసంబును నచ్చతెనుంగు రామాయణంబు
సారంగధరనరేశ్వరచరిత్రంబు సప్తార్ణవసంగమాహాత్మ్యకంబు
రసికజనమనోభిరామంబు లక్షణసారసంగ్రహమును సర్పపురస

తే. మంచితక్షేత్రకథనంబు మఱియుఁ బెక్కు
శతకదండకసత్కృతుల్ ప్రతిభఁ గూర్చి
యుల్ల మలరారఁ బార్వతీవల్లభునకు
భక్తి నర్పణఁ జేసినభవ్యమతిని. 5

వ. ఇట్టి నేను మదభీష్టదైవతంబైన కుక్కుటేశ్వరశ్రీమన్మహాదేవునకు నంకితంబుగా
మఱియు నొక్క ప్రబంధంబు రచింపం దొడంగి. 6

## షష్ఠ్యంతములు

క. సర్గాపసర్గఫలదని
సర్గునకున్ భర్గునకుఁ బ్రశమితమహాంహో
వర్గునకు సూరినుతస
న్మార్గునకు మనోజ్ఞసానుమద్దుర్గునకున్. 7

క. అంభోజాసనమదసం
స్తంభునకున్ శంభునకు నుదంచితకరుణా
రంభున కభిలావనసం
రంభునకున్ మందితమానిరాడ్డింభునకున్. 8

క. సర్వసుపర్వకదంబక
పూర్వునకున్ శర్వునకును భుజబలలీలా
ఖర్వునకు శమితయమరా
డ్గర్వునకు మహోక్షరాజగంధర్వునకున్ 9

క. బాణాదిభక్తజనసం
త్రాణునకున్ స్థాణునకు నుదంచదుదన్వ
త్తూణునకు సరసిజేక్షణ
బాణునకున్ సత్యవాక్యపరిమాణునకున్ 10

క. సామజదానవదర్పవి
రామునకున్ సోమునకును రజతమహీభృ
ద్ధామునకుఁ గోటిదినకర
ధామునకు మహోగ్రసమరతలభీమునకున్. 11

క. పురదైతేయస్మరసం
హరునకు హరునకు నిరంతరాత్యంతదయా
పరునకుఁ బీఠాపురమం
దిరునకు శ్రీకుక్కుటేశదేవవరునకున్. 12

వ. సమర్పణంబుగా నారచియింపం బూనినశివలీలావిలాసం బనుశృంగారరస
ప్రబంధంబునకుం గథావిధానం బెట్టి దనిన. 13

## కథాప్రారంభము

గీ. హస్తిపురమున నొక్కనాఁ డర్జునుండు
భీష్ముఁ గన్గొని మ్రొక్కి సంప్రీతిఁ బలికెఁ
దాత! ని న్నొక్క పుణ్యకథాప్రసంగ
మడుగఁ గోరెదఁ గృపతోడ నాన తిమ్ము. 14

క. నీ వెఱుఁగని పుణ్యకథల్
క్ష్మావలయమునందు లేవు గద యేవైనన్
భావింపఁగ నఖిలజగ
త్పావని యగు గంగమహిమఁ బ్రతిభం జెపుమా. 15

ఆ. శివుఁడు గంగ నేల శిరమున నిడుకొనె?
గంగ విష్ణుపాదకమలమున జ
నించు టెట్లు? తాత! నిక్కంబుగా నిది
తేఁటపడఁగ నాకుఁ దెలుపవలయు. 16

వ. అదియునుం గాక. 17

గీ. గంగఁ గొందఱు జాలరికన్నె యనుచు
నెన్ను చుండుదు రమ్మాట యేర్పడంగ
వినఁ దలంచెద నమ్మహావేణి కీవు
కూర్మిపట్టివి గద లసద్గుణకపాల! 18

గీ. అనిన గాంగేయుఁ డప్పాండుతనయుఁ బలికె
వత్స! నే మున్ను నారదువలన విన్న
తెఱఁగు నీ కిప్పు డెలమితో నెఱుఁగఁ జేతు
నింపు దైవార విను మని యిట్టు లనియె. 19

ఆ. మొదలఁ గమలగర్భుఁ దుదకంబుల సృజించి
వీర్యమందులోన విడిచె నది స
హస్రకరనిభప్రభాంచితమై హిర
ణ్యస్వరూప మైనయండ మయ్యె. 20

వ. అయ్యండంబునందుఁ జరాచరాత్మకం బైనసకలప్రపంచంబు సృజియించి
వృద్ధిఁ బొందింపుచుండె నంత. 21

గీ. మూషకాసురుఁ డనుసురద్వేషి యొకఁడు
దూఱి యయ్యండమున కొకతూటు వొడిచె
నందువలన మహోదకం బద్భుతంబు
మీఱఁ బెనువెల్లియై చొచ్చి పాఱుచుండె. 22

గీ. ఆ వెల్లి జగము లన్నియు
వేవేగ న్ముంచి జంతువితతికి నెల్లన్
వావిరి నుపద్రవంబుం
గావింపుచు నున్న నీలకంతుఁడు పేర్మిన్. 23

గీ. జగదుపద్రవశాంతికై తగిలి మున్ను
కాలకూటంబుఁ గంఠభాగమున నిడ్డ
చందమున నమ్మహాంబునిర్ఝరము నెలమిఁ
దనజటాజూటవీథి నందముగఁ దాల్చె. 24

గీ. అపుడు గంగ మహేశుజటాగ్రవీథిఁ
బట్టఁజాలక యుప్పొంగి పైకిఁ బొరలి

ఘనతరంగిణి యై దూఱి కమలజాండ
వివరమునఁ బాఱె జగదుపద్రవము గాఁగ. 25

గీ. హరియు నయ్యెడ మూషకాసురు వధించి,
తనపదాంగుష్ఠ మబ్బిలద్వారసరణి
నునిచి నీ రాఁచె సందుననుండి యూఁట
యించు కాలోపలికిఁ బ్రవహింపుచుండె. 26

వ. అ ప్రవాహంబు సకలభూవనంబులఁ బవిత్రంబుగా గంగాభవాని యేకార్ణవంబుగ జగంబులన్నియు ముంచి లోజంతుకోటిజలచరంబులక్రియ మించి చెలంగి పొంగి.

క. తన కెదు రెవ్వరు లే రని
మునుకొని గర్వాతిరేకమునఁ బలికిన న
వ్వనితారత్నము గనుఁగొని
కినుక మదిం బెనఁగొనంగ గిరిశుఁడు పలికెన్. 28

గీ. అఁడుదానవు నీ కిట్టు లబ్బురంపు
గర్వ మేటికి నాచేతఁ గమలసంభ
వాదులును మున్ను గర్వించి యడఁగి చనిరి
గర్వ మెంతటివారికిఁ గాదు సుమ్ము. 29

క. భూచక్రంబున కిప్పుడె
వే చని నీ వందు మత్స్యవిక్రయవృత్తిన్
బ్రాచుర్యంబుగ మనియెదు
నీచకులంబున జనించి నిలువుము చెలియా! 30

గీ. అనిన నళుకొంది గంగ యో యనఘచరిత!
తప్పు సేసితి లొంగి నీదయ దలిర్పఁ
గాచి రక్షించు నన్నెదఁ గాఁక యిడఁగ
నిన్ను నెడఁబాసి క్షణమైన నిలువఁజాల. 31

క. నావుడు శంకరుఁ డిట్లను
నీ వటువలెఁ గొన్నినాళ్లు నిలిచినపిదపన్
దేవత లెన్నఁగ నిన్నున్
దేవేరిగఁ బెండ్లియాడి తెచ్చెద మరలన్. 32

వ. అని పరమేశ్వరుం డానతిచ్చిన నట్లనె గంగాభవాని దాసకులకన్యాస్వరూపంబు
ధరియించి భూలోకంబునకు వచ్చి పారావారతీరంబున మహేశ్వరుం గుఱించి
తపం బాచరింపుచుండె నంత. 33

సీ. శంఖదేవుం డనుజాలరిగేస్తుండు దనబంధువులఁ దానుఁ దవిలి యొక్క
నాఁడు దా నేలూరినగరంబునందుండి జలధికి వేఁటాడఁ జని యొకయెడఁ
దపముసేయుచు నున్నతరళాయతేక్షణఁ జిన్ని కన్నియఁ జూచి చేరఁబోయి
తల్లి! నీ వెవ్వరిదానవు? కుల మెద్ది? తలిదండ్రు లెవ్వారు? కులము పేరు

గీ. నెద్ది? తప మేల చేసెద విచట నిట్లు?
సరసిజానన! నాకు నీ చందమెల్లఁ
దెలియఁజెప్పు మటన్న నక్కలికిమిన్న
యింపు దళుకొత్త నతనికి నిట్టు లనియె. 34

గీ. తండ్రి! విను మేను గంగను దక్షహరుఁడు
నన్ను నొకకారణమున డెందంబులోన
నలిగి జాలరికన్నియ వై జనించు
మని శపించిన వచ్చి యి ట్లైతిఁ జుమ్ము. 35

గీ. తల్లి యైనను విను మఱిఁ దండ్రి వైన
నీవె కా నింక నన్యుల నే నెఱుంగ
నెవ్విధంబున సాఁకెదొ హితముతోడ
ననిన ముద మంది యతఁ డిట్టు లనుచుఁబలికె. 36

గీ. అమ్మ! నీ వేమి గోరిన నట్ల సేతుఁ
గలవు మా యింట సకలభాగ్యంబు లిపుడు
రమ్ము నాతోడ మాభవనమ్మునకును
జీవనప్రాయముగఁ జూతుఁ జెలియ! నిన్ను. 37

క. రావమ్మ భువనపావని!
రావే నా ముద్దుబిడ్డ! రావె లతాంగీ!
రావే శుభఫలదాయిని!
రావే జగదంబ! యిపుడె రా నాతోడన్. 38

వ. అని యపుత్త్రకుండు గావునఁ బెన్నిధానంబు గన్న పేదచందంబున దైవంబు నాకిప్పు
డిబ్బాలారత్నంబు నొసంగె నని పొంగి దానిం దోడ్కొని నిజగృహంబున కరిగి తన
భార్య యగుచక్రమదేవి కప్పాప నొసంగిన నవ్వధూరత్నంబు. 39

ఆ. పెరుఁగు ఁబాలు జున్ను బెల్లంబు నెయ్యి కొ
బ్బరి యనంటిపండ్లు పనసపండ్లు
పిండివంట లిక్షుఖండంబు లోరెంబు
ప్రీతి యొసఁగ నొసఁగి పెనుచుచుండె. 40

వ. అట్లు పెనుచుచున్నయెడ. 41

ఉ. అంగదముద్రికావలయహారలలాటిక లెమ్మెనెమ్మెయి
వ్రంగులు గుల్కఁ గ్రొందగటునాడెపుఁబావడసొంపు నింప మే
ల్బంగరుగిల్కుటందియలు బాళిగ నంద్రుల ఘల్లుఘ ల్లనన్
గంగ యనుంగులం గలని కౌతుకలీలలఁ గ్రీడసేయుచున్. 42

సీ. బొమ్మపెండ్లిండ్లు సొంపుగఁ జేసి గుజ్జనగూటియామెత లనుంగులకుఁ బెట్టు
బలితంపుటపరంజిపంజరంబుల నిడి చిలుకబోంట్లకు మేఁత లెలమి నొసఁగు
నాడెంపునెలఱాలమేడలపై నిల్చి లీలమై తూఁగుటుయ్యాల నూఁగుఁ
బరువంపు నెత్తావివిరిబొండుమల్లెకుం జాదులనీరెత్తి ప్రోదిసేయు

గీ. బోటులను గూడి కిన్నెర మీటు నింపు
నాటుకొలుపుచు జిలిబిలిపాట పాడు
హోళి దైవారఁ జెంగల్వకేళికులుల
నోలలాడుఁ జెలంగి యవ్వాలుగంటి, 43

వ. అట్లు గ్రీడింపుచు దినదిన ప్రవర్ధమాన యగుచున్నంత. 44

సీ. నిద్దంపుసోగ పెన్నెరులు వేనలికందె నెదఁ జిన్నిచన్నులు కుదురులెత్తెఁ
గనుదోయి నరసిగ్గుకలికిచూపు లెసంగె నూనూఁగునూఁగారు గానవయ్యెఁ
దావిమోవికిఁ గ్రొత్తతలిరుడాలు ఘటిల్లె జిలిబిలిపలుకుల మొలచె దీప్తి
నెమ్మొగంబున వింత నిగనిగజిగిపొల్చెఁ జిన్నారినగవులు చెంగలించె

గీ. నడలఁ గడలేని మురిపెంబు గడలుకొనియె
మెఱుఁగుచెక్కులతళతళల్ దుఱఁగలించెఁ
గటిభరం బించుకించుక ఘనతఁ దాల్చెఁ
జెలికి లేజవ్వనము మేన మొలుచుటయును. 45

వ. అట్టి నవయౌవనారంభంబునఁ జీనిచీనాంబరానర్ఘమణివిభూషణసుగంధతాంబూ
లాదికంబులం దేజరిల్లుచుండె నంత. 46

సీ. సిరులకు మన్కి యై చిరసుఖాకర మైన కైలాసశైలశృంగంబునందు
మహనీయతపనీయమయసముద్దీప్తినిశాకాంతమాణిక్యసౌధవీథి
నలువయు వెన్నుండు జలరిపు ప్రముఖదిక్పతులును సనకాదియతివరులును
నందీశగుహగజాననభృంగిరిటవీరభద్రభైరవముఖప్రమథపతులు

గీ. దవిలి కొలువంగ గిరిరాజతనయఁ గూడి
యనుపమానర్ఘరత్నసింహాసనమున
నక్కజం బగుఠీవిమై నొక్కనాఁడు
హాళిఁ గొలువుండె రాజరేఖార్ధమౌళి. 47

వ. అయ్యవసరంబున. 48

సీ. మినువాక తెలినీరు నినిచినకుండికఁ బసిఁడిచాయలఁ గేరుపల్లజడలు
వెన్నెలనిగ్గును వెదచల్లునెమ్మేను చక్కనిస్ఫటికంపుజపసరంబు
గాలి సోఁకిన మ్రోయుకడిఁదికిన్నెరవీణె యభినవమృదులకృష్ణాజినంబు
దట్టంపుగోపిచందనపుండ్రవల్లికల్ పసమించుకాషాయవసనములును

గీ. గలిగి భవభర్గ! చంద్రశేఖర! మహేశ!
హర! మహాదేవ! సాంబ! శంకర! గిరీశ!
యనుచు వేడుక నచ్చోటి కరుగుదెంచె
సారవిద్యావిదుం డైననారదుండు. 49

గీ. అ ట్లరుగుదెంచి దివిజసంయమివరుండు
భక్తి దైవార నమ్మహాప్రభునినగరు
సొచ్చి హెచ్చిన వేడుక లచ్చుపడఁగఁ
గేలు గనమోడ్చి యద్దేవిమ్రోల నిలిచి. 50

సీ. రాకేందునీకాశరమ్యగాత్రమువాని రమణీయఫణిభూషణములవానిఁ
గందర్పశతకోటిసుందరాకృతివాని డమరుత్రిశూలఖడ్గములవాని
సదమలదరహాససరసాననమువాని భసితాంగరాగవిభ్రమమువాని
సింధురాజినసమంచితనిచోళమువానిఁ గరుణాకటాక్షవీక్షణమువానిఁ

గీ. బ్రథితభువనాద్భుతోరువైభవమువాని
ఘనతరానందహృదయపంకజమువాని
సకలలోకాధిపతియైన సాంబశివునిఁ
గనియె మునిమౌళి కన్నులకఱవు దీఱ. 51

క. అటువలెఁ బొడఁగని కేల్గవ
నిటలస్థలిఁ జేర్చి సంజనితకౌతుకవి
స్ఫుటదంతరంగుఁ డై య
జ్జటికులవల్లభుఁడు వాక్యచాతురి మెఱయన్. 52

సీ. భసితాంగరాగాయ భక్తానురాగాయ ఫాలేక్షణాయ తుభ్యం నమోఽస్తు
భర్మాద్రిచాపాయ భద్రేంద్రవాహాయ భయవిదూరాయ తుభ్యం నమోఽస్తు
భండనోద్దండాయ భానుప్రతాపాయ భవ్యరూపాయ తుభ్యం నమోఽస్తు
భరతప్రవీణాయ భవనాయితనగాయ భద్రప్రదాయ తుభ్యం నమోఽస్తు

గీ. భావభవసంహరాయ తుభ్యం నమోఽస్తు
భవసరన్నావికాయ తుభ్యం నమోఽస్తు
భద్రచర్మాంబరాయ తుభ్యం నమోఽస్తు
భారతీశార్చితాయ తుభ్యం నమోఽస్తు. 53

వ. అని నమస్కరించి వెండియు. 54

సీ. జయజయ కైలాసశైలనికేతన! జయజయ దేవతాసార్వభౌమ!
జయజయ గిరితనూజామనోంబుజభృంగ! జయజయ దైవవేశ్యాభుజంగ!
జయజయ నిగమాంతసముదయసంవేద్య! జయజయ భువనరక్షాధురీణ!
జయజయ జలజాతసంభవాండపిచండ! జయజయ శాశ్వతైశ్వర్యధుర్య!

గీ. జయ పురందరహరివిరించనముఖాఖి
లామరస్తోమముకుటాంచలాంచితాబ్జ
రాగమాణిక్యరోచిర్విరాజమాన
చరణపంకేరుహోద్దేశ! జయ! మహేశ! 55

క. పరమేశ! నిన్నుఁ బొగడఁగఁ
దరమే శేషునకు హరిపితామహబలసం
హరులకు సనకాదిమునీ
శ్వరులకు నొక్కింత యైన వర్ణింపంగన్. 56

సీ. మహిమ మీఱఁగ సర్వమంత్రరాజం బైన గాయత్రి కీవె పో నాయకుఁడవు
శ్రుతు 'లేక యేవ రుద్రో న ద్వితీయ' యం చనిశంబు నిన్నె కా వినుతిసేయుఁ
బ్రత్యహంబును 'శివాత్పరతరం నాస్తి' యం చలర స్మృతుల్ నిన్నె తెలుపుచుండుఁ
బురుషోత్తమఖ్యాతిఁ బరగు వెన్నుఁడు వేయి రాజీవముల నిన్నె పూజసేయు

గీ. జలజగర్భుండు మొదలగు జంతువులకు
పతి వగుటcజేసి నీకె విశ్రుతము గాcగc
బశుపతిసమాఖ్య చెల్లె నస్రమ్ము మీఱ
నిన్నుcగొనియాడ నెవ్వరు నేర్తు రభవ! 57

మ. కరికిన్ మర్కటకీటపోతమునకుం గాలాహికిన్ మూలపో
టరికిం జెంచుకొలంపుబత్తునకు వేడ్క న్మోక్షసామ్రాజ్యసు
స్థిరసౌఖ్యం బొనcగూర్చి ప్రోచినకృపాసింధుండ వాహా! భళీ!
సరియే యీహరి కుఱ్ఱవేల్పుదొర లెంచ న్నీకు శ్రీకంధరా! 58

గీ. శ్వేతుcడు మృకండుసూనుండుc బ్రేతనాథు
చేతc గదలేనియిడుమలc జిక్కి పొక్కి
నిన్ను శరణన్న జముc బదcదన్ని వారి
కెన్నటికిc జావు లేకుండ నిడితి వభవ! 59

క. హరి తననయనాబ్జముతో
దొరలcగ నొకవేయివికచతోయజముల నీ
శిరమునc బూజించినc గని
యిరువుగ నాతనికిc జక్ర మిచ్చితివి గదా!. 60

క. సురదనుజు లబ్ధిc దరువcగ
గరళము ప్రభవించి జగము గాల్పcగ దానిన్
సరగున గళమున నిదుకొని
పరిపాలించితివి గద ప్రపంచంబు శివా! 61

గీ. భైరవాకృతియును వీరభద్రమూర్తి
శరభసాళువరూపంబు సరవిc దాల్చి
నలినభవదక్షనారసింహులశిరంబు
లేపుమీఱంగc దునుమవె యీశ! నీవు. 62

సీ. గడితంపుటపరంజిగట్టు సింగిణివిల్లు గాలిబోనపుcదిండికాcడు నారి
యీరేనుమేనుల నేపు చూపు లకోరి యార్మ్యాcదుతునియలై యలరు నరద
మిరుదుగ మొగములదొర తేరుపూన్పతీ పగటివేలుపు నేలబండికండ్లు
ప్రాcబల్కు తుటుములు బలవారువంబులు తెరగట్టుమన్నియ తెగలు బంట్లు

గీ. గాఁగ దిగ్ప్రోళ్ళు బలితంపుఁ గడిమిఁ గూల్చి
జగమునావడి యుడిపి నిశ్శంక నలరు
నీ ప్రభావంబు బుధులు వర్ణింపఁ గలరె
భానుశతకోటిసంకాశ! పార్వతీశ! 63

సీ. పులికరాసంబును బూదిగంధంబును బుఱియకంచంబును బునుకపేర్లు
చిలువఱాసొమ్ములు చికిలిముమ్మొనవాలు కంకటికోడలేజింక కూన
పలుకుటందియలు చౌవంచనెమ్మొగములు మెట్టబిడారంబు వెట్టకన్ను
చేతికుత్తుక యాలపోతుటెక్కెంబును గ్రొన్నెలతలపువ్వు విన్నుదురము

గీ. గలిగి వెలుఁగొందు నీ మూర్తిఁ దలఁపునందు,
నిలిపి యే ప్రొద్దుఁ గొలుతు న న్నెలమిఁ బ్రోవు
శత్రుబలభీమదేవతాసార్వభౌమ!
గిరిసుతానాథ! నిఖిలనిర్జరసనాథ!. 64

గీ. వేయినోళ్లను మఱి రెండువేలనాలు
కలు గలుగు శేషునకునైన నలుమొగముల
ప్రోడకైనను దరమె ని న్బొగడ నింక
వేయునేటికి ననుఁ బ్రోవు విశ్వజనక! 65

గీ. అని నుతించుమునీంద్రుఁ గన్గొని శివుండు
సారకరుణామృతార్ద్రసుస్వాంతుఁ డగుచు
నుచితపీఠాంతరమునఁ గూర్చుండఁజేసి
కుశల మడిగి యతిమధురోక్తుల వచించె. 66

క. మునివర! సకలజగంబులు
ననివారణముగఁ జరింతు వచట నచట నీ
కనుఁగొన్నవింత లెల్లను
వినుపింపుము మాకు వేడ్క విస్తరిలంగన్. 67

క. ఏయేజగములఁ జూచితి
వేయేదేశములు గంటి వేయేపురముల్
పాయక పొడఁ గాంచితి విపు
డాయెడలం గలుగువార్త లచ్చుగఁ జెపుమా. 68

గీ. అనిన నారదుం డి ట్లను నభవ! సకల
భువనములఁ జూచుకొనుచు నేఁ బోయిపోయి
నవకుతూహలమహితమానసుఁడ నగుచు,
భూతలమ్మున నేలూరిపురము గంటి. 69

సీ. బహురత్నవిరచితప్రాసాదములచేత రమణీయమణిగోపురములచేత
నిందితాకరదివ్యమందిరంబులచేత సుకరకపోతపాలికలచేతఁ
దపనీయమయదేవతాధామముల్చేతఁ బటువజ్రసోపానపటలిచేత
భక్తశైలోన్నతప్రాకారములచేత దివిజేంద్రనీలవేదికలచేత

గీ. విమలపద్మాకరోద్యానసమితిచేత
గంధగజరాజధేనుసంఘములచేత
ధరణిసురముఖ్యసజ్జనోత్తములచేత
భవ్యగతిఁ బొల్చు నేలూరిపట్టణంబు. 70

చ. అసమశరోపమానసముదంచితవిగ్రహుఁ గంటి నందుఁ గ్రొ
మ్మిసిమికడానిబంగరపుమించులమించుపిసాళిమేసిరుల్
రసికమనోంబుజంబులకు రాగము గూర్పఁ గొఱంతలేని మే
ల్పస నలరారు నొక్క యెలఁబ్రాయపు జాలరికన్యకామణిన్. 71

ఉ. అన్నులమిన్నులం ద్రిభువనాంచితరూపవిలాసమాన్యలం
గన్నులఁ గంటిఁ గాని శశిఖండనమండన! యెందు నేని న
క్కన్నియవంటిసోయగపుఁగల్కిఁ గనుంగొను టే నెఱుంగ నో
యన్న! గణింప శక్యమె మహాహికి దానికడిందియందముల్. 72

ఉ. కొమ్మలు సాటియే మరునికొమ్మకరంబునఁ గ్రాలుజాళువా
బొమ్మకుఁ గమ్మవింటినెఱపోటరి క్రొవ్విరితోఁటలోనిదా
నిమ్మకు నిమ్ముల న్వలచునిద్దపుసంపెఁగపూవుకొమ్మ కం
దమ్ములకెల్ల నిల్కడ యనం దగు జాలరిముద్దుగుమ్మకున్. 73

చ. కులుకుమిటారిగబ్బిచనుగుబ్బలసోరు జగానిగారపుం
దొలుకరికార్మెఱుంగుల నెదుర్కొనుకొప్పుమిటారునిద్దపుం
గలికిపిసాళివాలు తెలిగన్నులతీరు గణింప మాయురే!
యల కలకంఠకంఠి కలరారునొయారులు దాని కుద్దియే? 74

సీ. చిన్నారిజాబిల్లి కన్నెగేదఁగిపువ్వు వెన్నెల తెలినిగ్గువన్నెలగని
తళుకుపుత్తడిబొమ్మ తొలుకరిక్రొమ్మించు తలిరుజొంపపుమావి పలుకుచిల్క
చక్కెరలప్ప గొజ్జఁగినీటిపెనువాఁక కపురంపుబరిణె చెంగలువకొలను
వలపులదీవి జవాదినించినబావి కమ్మకస్తురిక్రోవి నిమ్మపండు

గీ. చికిలినిద్దంపుటద్దంబుపికిలిబెండు
మగువతలమిన్న వెలలేనిమానికంబు
నాఁగ నలరారు నయ్యేలనాగబాగు
దెలుప శక్యంబె యేలాటివలఁతికైన 75

సీ. సతిమోమునకు నోడి చందమామ కృశించి వెలవెలనై బైట వ్రేఁగుచుండెఁ
జెలిక్రొమ్ముడికి నోడి తొలుకరిమబ్బులు నిలువెల్ల విషమూని మలలు ముట్టె
నువిదపాలిండ్లకు నోడి బంగరుగిండ్లు కాఁకచే నుడుకుచుఁ గఱఁగఁ బాఱెఁ
జేడికన్దోయికి నోడి బేడిసమీలు మిట్టిపాటున నేట బిట్టుపడియెఁ

గీ. దరుణినునుజెక్కులకు నోడి దర్పణములు
మైల వాటిలఁ గొంతఁ గన్మాసి యుండె
నేమి చెప్పుదు నఖిలలోకేశ! నీకు
దాని సౌందర్య మెన్న నాతరము గాదు 76

సీ. అలికులవేణి శైవలరోమవల్లరి సారసవదన కల్హారపాణి
కలహంసగామిని కచ్ఛపచరణాగ్ర మకరజంఘాలత శకులనయన
కలభోరుకాండ కోకపయోధరద్వయ సైకతజఘన కింజల్కరదన
కంబుకంధర వీచికావళి యావర్తనాభికావివర మృణాలబాహ

గీ. యగుచు భువనాభిరామవిఖ్యాతి నెపుడు
వెలయుచున్నట్టి యాఘనవేణితోడ
గరుడగంధర్వయక్షకిన్నరనిలింప
భుజగగజగామినులు సాటి వోలఁ గలరె. 77

క. పొదవుగ నెగసి తళుక్కని
పొడచూపి యదృశ్య మగుచుఁ బోవుమెఱుంగుల్
పడఁతుకనెమ్మెయిజిగి కెన
యిడఁగాఁ బోలవు గదయ్య! యిందువతంసా! 78

సీ. ఇది కీలుజడ గాదు చదువుపల్కుహుమావజీరునివాఁడికటారు గాని
యిది నెమ్మొగము గాదు కొదమతుమ్మెదనారివిలుకానియద్దంపుఁబలక గాని
యివి కటాక్షము లౌనె చివురాకుబాకుసాధనుగానితూఁపుమొత్తములు గాని
యివి కుచంబులు గావు పువుఁజిరానెఱజోదుమేలిబంగరుబొంగరాలు గాని

గీ. యిది వలపుకెంబెదవి గాదు మదనభూప
కరవిరాజితపద్మరాగంబు గాని
యనుచు రసికాగ్రణులు దనయవయవములఁ
బొగడ నెగడొందు నౌర! యాచిగురుఁబోఁడి. 79

సీ. కలికివాల్గన్నులఁ దిలకించి చూచిన వెడవింటిదొరబాణవృష్టి గురియుఁ
గులుకుచు జలిబిలితెలినవ్వు నవ్వినఁ గమ్మగప్రపుదుమారమ్ము గ్రమ్ముఁ
దొకతొకవెలయుముద్దులమాట లాడిన సొంపార విరితేనెసోన చిలుకుఁ
బుడమిఁ జక్కఁగఁ జూచి యడుగిడి నడిచినఁ బలితంపుఁగెంపురంగులు వెలుంగుఁ

గీ. గచకుచకటిభరంబుచేఁ గౌను వడఁక
నూత్నచామీకరామూల్యరత్నఘటిత
కాంచికాఘటికాఘణంఘణలు సెలఁగ
దాసకులనారి మరునినిద్దపుఁగటారి. 80

ఉ. సుద్దుల కేమి నాపలుకు సూనశరాంతక! చిత్తగింపు మ
మ్ముద్దియతళ్కు చూ పతనుమోహనశాతశిలీముఖంబుతో
నుద్దిదుకంగఁ బోయి మది నూహ యొనర్పఁగ నట్లు గానిచో
నద్దిర! యెల్లవారిహృదయంబులఁ గాఁడి చనంగ నేర్చునే. 81

ఉ. ఆ లతకూన యా లలన యా లవలీదళకోమలాంగి యా
లోలకురంగశాబకసులోచన యా మదచంచరీకనీ
లాలక యా సమగ్రతుహినాంశుమనోజ్ఞముఖారవింద యా
నీలకచాశిరోగ్రమణి నీకుఁ దగుం బెఱమాట లేటికిన్. 82

గీ. గంగ యనుపేరు దన కెసఁగంగ భువన
మంగళాకృతిఁ బొల్చు నయ్యంగనాల
లామఁ గనుఁగొంటి వేని యోస్వామి! నీకు
నిరుపమానందసంసిద్ధి దొరకుఁ జుమ్ము. 83

గీ. అని మునీంద్రుఁ డెఱింగింప నభవుఁ డపుడె
కొలువు చాలించి యెల్లవారలను బోవఁ
బనిచి తనతోడ రాఁ గోరుపర్వతాధి
రాజపుత్త్రిక నంతఃపురమున నిల్పి. 84

సీ. జడలు చిక్కులువాపి నడునెత్తి సిగవైచి తావిసంపెఁగపూలదండఁ జుట్టి
నిటలభాగమున నున్నెలిబూదిరేఖయుఁ బూపకస్తురిచుక్కబొట్టు వెట్టి
వలువబంగరుశాలువలెవాటు గావించి మొలఁ బట్టుదట్టియమ్ముల బిగించి
నులిచిగా టెంపుమీసలు చక్క సవరించి బవిరిగడ్డము దీరువడఁగ దువ్వి

గీ. కేలఁ జారుకపాలంబు గీలుకొలిపి
మేన నవగంధసారంబు మెదిచి పూసి
గిలుకుపావలఁ దొడిగి యుగ్గిరిశుఁ డప్పు
డతిమనోహరజంగమాకృతి ధరించె. 85

వ. అట్లు జగన్మోహనోదారజంగమాకారంబు ధరించి చనుదెంచి యేలూరి మహా
నగరంబుఁ బ్రవేశించి తదంతికప్రదేశంబున నొక్కచోట. 86

మ. కనియె న్నీలగళుండు బిల్లబదరీఖర్జూరజంబీరచం
దనమందారలవంగచూతలవలీనారంగభల్లాతకీ
పనసాశ్వత్థకపిత్థతాలవటరంభానారికేళాదికా
వనిజాతానిశభాసమానము సరోవాపీవృతోద్యానమున్. 87

సీ. కలకంఠకులకంఠకాకలీధ్వానము ల్చెలఁగి దిగ్వలయంబు చెవుడు పఱుప
శుకశారికాకదంబకమృదుస్వనములు జనుల కామోదంబు సంఘటింపఁ
బ్రమదనృత్యన్మత్తబర్హిణారావంబు లవిరతశ్రుతిపుటోత్సవ మొనర్ప
నవనవమకరందనందితేందిందిరగానము ల్చిరసుఖాకరము గాఁగ

గీ. ఘనమరాళారవంబులు గ్రమ్ముకొనఁగ
బంధురసుగంధగంధిలగంధవాహ
శాబకము లోలి నధ్వకశ్రమము దీర్ప
నతిమనోహరగతిఁ బొల్చె నవ్వనంబు. 88

వ. అందు. 89

సీ. తావులీనెడుగుజ్జుమావిమ్రాకులచెంతఁ బెనఁగొన్న గున్నసంపెఁగలపజ్జఁ
గపురంపుటనఁటిమోఁకల కంటి బ్రాఁకిన పరువంపుద్రాక్షపందిరులక్రింద
గమగమవలచుచొక్కంపుగొజ్జఁగినీట నేటఁ జక్కెరకడ నిరువుకొన్న
బలితంపుఁజెంగల్వబావులక్రేవులఁ బన్నినచలువచప్పరమునీడ

గీ. నందముగఁ బొల్చు నిద్దంపుఁజందమామ
ఱాలఁ గట్టినజాళువామేలితిన్నె
మీఁద మోదంబు దళుకొత్త మిక్కుటంపు
ఠీవిఁ గూర్చుండె జంగమదేవుఁ డపుడు. 90

వ. అయ్యవసరంబున. 91

సీ. కురులు చిక్కులు విప్పి కొప్పు విప్పుగ దిద్ది యసదుకస్తురిబొట్టు నొసలఁ బెట్టి
వలిపెచెంగావిపావడ చక్క సవరించి కళుకుబంగరుచేలఁ గటి ఘటించి
జిలుఁగుపైఠాణికంచెల గుబ్బలు బిగించి గడితంపువలిగమ్మగలప మలఁది
కలికికన్నుల మించుకజ్జలంబు ధరించి యలరుసంపెఁగదండ లఱుత నించి

గీ. హారకేయూరకటకమంజీరకాంచి
కాంగుళీయకకర్ణపత్రాదివివిధ
మణివిభూషణనిర్మలఘృణులు వెలుఁగ
గంగ శృంగారలీలావృతాంగి యగుచు. 92

గీ. నెచ్చెలులఁ గూడి వేడుక లచ్చుపడఁగ
నొచ్చె మొదవనిహాళిమైఁ బెచ్చు పెరిఁగి
పచ్చవిల్కానిమేటిరాలచ్చి యనఁగ
వచ్చి చెచ్చెర శృంగారవనము సొచ్చె. 93

క. చొచ్చి ఝుణంఝుణనినదస
ముచ్చయరంభాసమానమోహనకటకో
ద్యచ్చరణసరసిరుహ యై
విచ్చలవిడిఁ బూలు గోసె వెలఁదులు దానున్. 94

చ. చిలుకలఁ దోలి కోయిలలఁ జిందరవందర గాఁగ నేలి కే
కుల బెదరించి తుమ్మెదల గుప్పునఁ బాఱ నడంచి యంచలం
గొలకలఁ బాపి జక్కవలకు న్నిలరాయిలు చూపి పూఁబొదల్
వలఁగొని దూఱి కప్పురపువంతుల దాఁటి విహారలీలలన్. 95

గీ. కప్పురము రేఁచి లతికానికాయ మూఁచి
పాదపము లెక్కి తియ్యనిపండ్లు మెక్కి
సరసగతి దాసి తావిక్రొవ్విరులు గోసి
చెలులు పుష్పాపచయకేళి సలిపి రోలి. 96

సీ. కనకాంగి! నీ నాసికకు జోక యగువీఁకఁ గనుపట్టుచున్నవి గంధఫలులు
శుకవాణి! నీవాతెఱకు సాటి యగుపాటిఁ దనరారుచున్నవి దాసనములు
ముకురాస్య! నీ గుబ్బలకు నుద్ది యగుబుద్ది నిం పూనుచున్నవి యీడెపండ్లు
కలకంఠి! నీనాభికకు సరియగుమురిఁ బొలుపొందుచున్నవి పొన్నపూలు

గీ. ముగుద! నీ దంతముల కెన యగుపొగరున
మురువుఁ జూపుచు నున్నవి మొల్లమొగ్గ
లనుచు నన్యోన్యసరసోక్తు లాడుకొనుచు
ననలు గోసిరి సరసిజాననలు మొనసి. 97

ఉ. అప్పుడు జంగమేశ్వరుఁ డొయారము దద్దయు మీఱ వేడ్కతో
గుప్పున లేచి పాదముల గుత్తపుఁబావలు మెట్టి లీల న
య్యొప్పులకుప్ప లున్నయెడ కు బ్బలరారఁగఁ జేరి కోరికల్
చొప్పడ మ్రోల నిల్చి మదిఁ జొక్కుచు నబ్బురపాటు వాటిలన్. 98

సీ. చిన్నారిమోమునఁ జిలుఁగుచెమ్మట గ్రమ్మఁ గొనబాఱుపువ్వులఁ గోయుదాని
గడితంపులేయెండఁ గ్రాఁగిన నెమ్మోయి నీడల నందంద నిలుచుదానిఁ
దాఱి పూఁబొదరిండ్ల దూఱుచో సడలినక్రొమ్ముడి సవరించుకొనెడిదాని
గుత్తంపువలిగబ్బిగుబ్బచన్నులమీఁద నులుకొన్న సరు లిమ్ముకొలుపుదాని

గీ. నీటుమీఱంగ జిలిబిలిపాటఁ బాడి
బోటులకు సంతసం బెదఁ బూచుదాని
వన్నియలకెల్ల మిన్నయై యున్నదానిఁ
జిన్నిప్రాయంపుజాలరికన్నెఁ గనియె. 99

చ. కని యెనలేనికూర్మి మదిఁ గ్రమ్మఁగ నమ్మగమిన్నమిన్న కా
మనసిజరాజ్యలక్ష్మి యగుమానినిదగ్గఱఁ జేరి కోరికల్
బెనఁగొన నౌర యీకులుకుబిత్తరిగుత్తపునిండుగౌఁగిటం
దనివిపసన్ సుఖింపక నితాంతలతాంతశరార్తి యాఱునే. 100

క. అన్నుల నెందఱినేనియుఁ
గన్నులఁ జూచితిమి గాని గరుడాహిమరు
త్కిన్నరనరభామలు నీ
కన్నెలతలమిన్నఁ బోలఁ గలరే యెన్నన్. 101

గీ. సకియనెమ్మోము పున్నమచందమామ
కలికికన్నులు వాలుగగండుమీలు
పొలఁతిచనుగుబ్బ లపరంజిబొంగరాలు
తరుణిచెక్కులు మృదునవదర్పణములు. 102

గీ. కలికి పదియాఱువన్నె బంగరుసలాక
గావలయు నద్దిరా! యట్లు గాకయున్న
నఖిలసంగపరిత్యాగు లైనయతుల
డెందములకైన నాస పుట్టింపఁ గలదె. 103

చ. పగడము బంధుజీవకముఁ బంకజరాగము దాసనంబు లేఁ
జిగురును బింబికాఫలముఁ జెందిరముం దిరమొప్ప నిప్పుడే
ముగుదులమిన్నతియ్యనునుమోవికి సాటి యటంచు నెంచఁగాఁ
దగదు గదా! తగం దగవు దప్పి వచించుట దోసమే కదా! 104

చ. మొలకమిటారిగుబ్బలును ముద్దులుగారు మెఱుంగుచెక్కులుం
దళకుపిసాళిచూపులును దమ్మివిరి న్నిరసించుమోము క్రొం
దొలుకరిమబ్బులం దెగడుదోరపుఁగొప్పును గల్గి యొప్పు ని
క్కలికియలంతిజవ్వనము గన్నులపండువ యయ్యె నద్దిరా! 105

సీ. గజనిమ్మపండులగజిబిజి యొనరించి మాలూరఫలముల గేలిసేసి
తమ్మిమొగ్గలచౌకాటమ్మెల్ల సడలించి క్రొన్ననబంతులఁ జిన్నఁబుచ్చి
కరికుంభములఁ దిరస్కారంబు గావించి యపరంజిగిండుల నపహసించి
పొన్నకాయలసొరు సన్నగిల్లఁగఁ జేసి జక్కవకవ నెకసక్కె మాడి

గీ. మేలిరతనంపుబలుబొంగరాలఁ దెగడి
కనకధాత్రీధరేంద్రశృంగములఁ గేరి
లీల నలరారు నౌర! మే లీలతాంగి
కులుకుసిబ్బెపువలిగబ్బిగుబ్బదోయి. 106

గీ. బాలికామణిపెన్నెరుల్ బారెఁడేసి
చేడియలమిన్నకన్నులు చేరెఁడేసి
కలికివలిగబ్బిగుబ్బలు గావెఁడేసి
చేసి నడు మేల మాయంబు సేసె నజుఁడు. 107

చ. నిలుకడఁగన్న కార్మెఱుఁగు నిద్దపుఁబల్కుల నేర్చుకొన్నక్రొం
దళుకుపసిండిబొమ్మ నెఱతావులు గాంచినమానికంబు చే
ష్టలు గలగుజ్జుమావి దిగఁజాఱిననిర్మలచంద్రరేఖ యీ
యలికులవేణిసోయగ మయూరె యొయారుల నెందుఁ జెందునే. 108

ఉ. అద్దిర! నాకు దీని నెన రబ్బిన గొబ్బున గుబ్బదోయిఁ జే
కొద్దిగఁ బట్టి కౌఁగిటను గూర్చి నిగారపుమోవి సారెకు
న్ముద్దులుగొంచు మన్మథవినోదముల న్విహరింతుఁ గానిచో
నెద్దియు నామనంబున కొకించుక కోరికఁ దీర్ప నేర్చునే. 109

క. అని పలుకుచు మెల్లన య
వ్వనితామణిఁ జేర నరిగి వలపులు నిగుడన్
మనసిజమదసంహరుఁ డి
ట్లనియెన్ మృదువచనరచన లలరారంగన్. 110

క. ఎవ్వతవు నీవు? దవ్వుల
బువ్వులఁ గోయంగ వచ్చి పొలుపారెదు లే
జవ్వనపుమేను గందఁగ
నివ్వనవీథిం జరింప నేమిటి కబలా! 111

క. కామునిఁ బూజ యొనర్పనొ
హైమవతీరమణునకు సమర్పణ యిడనో
గోముగఁ బా న్పలరింపనొ
యేమిటి కీపూలు గోసె దిభరాడ్గమనా! 112

క. కొమ్మలను గూడి క్రొవ్విరి
కొమ్మలపై నిమ్ముమీఱఁ గూరిమిమరునా
లమ్ముల నెమ్మదిఁ ద్రిమ్మరు
తుమ్మెదలఁ గలంచె దిట్లు దోసము గాదే. 113

క. చెంగల్వలు వలెనో గొ
జ్జెంగులు గావలెనొ మంచిచేమంతులు సం
పెంగలు వలెనో తెచ్చెద
శృంగారవతీలలామ! చెపుమా నాకున్. 114

క. కొమ్మా కొమ్మా యిదె విరి
కొమ్మ కర మ్మలసి సొలసి కోసితి నీకై
రమ్మా పూఁబొదరిండ్లకు
నిమ్మారఁగ మఱియుఁ గోసి యిచ్చెద నచటన్. 115

క. జిలిబిలిచెమ్మట మోమున
నలుముకొనం బొదలవెంట నలసెద వేలా
వెలిపూసురటి న్విసరెద
నిలుమా యొక్కింతసేపు నీరజవదనా! 116

క. నను లాఁతివానిగా నె
మ్మనమునఁ దలఁపంగఁ జనదు మానిని! వేడ్కన్
నునుగప్పురంపువిడె మిది
గొనుమా యనుమాన ముడిగి కువలయనయనా! 117

వ. అనిన నేమియు మాఱాడక గంగ యూరకుండినఁ దత్సఖీజనంబు లజ్జంగమయ్యం గనుంగొని యి ట్లనిరి. 118

క. ఎవ్వఁడవు రోరి నీ విపు
డివ్విధమున నాము మీఱి యేకతమ వనిం
బువ్వులఁ గోయుచు మెలఁగెడు
జవ్వనులం జెనకి పొదువఁ జాగితివి భళీ! 119

క. ఏరా గారా మారఁగ
నారాటం బెత్తి హత్తి యబలలఁ జెనకన్
మేరా తీరా యూరక
పోరా పోరాము లుడిగి పొ మ్మెటకైనన్. 120

వ. అనిన వారివచనంబులు సరకుఁగొనక వెండియు జంగమేశ్వరుండు గంగం గనుంగొని. 121

గీ. పువ్వుబంతు లొసంగవే పువ్వుఁబోఁడి!
చిగురుటాకైన నీగదే చిగురుఁబోఁడి!
దండఁ గూరిచి యిడుము వేదండయాన!
యనుచు మెల్లన నర్మోక్తు లాడుకొనుచు. 122

సీ. కిన్నెర మీటి కన్గీటి సన్నలు సేయుఁ బకపక నగి యేలపదముఁ బాడుఁ
గెంగేలలాతంబు గిరగిరఁ ద్రిప్పు లోఁ జొక్కుచు వెడవెడ మెక్కు మెక్కు
లింగ లింగ యటంచుఁ జెంగున దాఁటు మీసలు గీటు గడ్డంబుఁ జక్కదువ్వఁ
గులుకుచు బిలిబిలిపలుకులఁ జెప్పు గామిడి యయి పైఁటకొం గొడిసి తిగుచుఁ

గీ. దివిరి బతిమాలి దిక్కులు దిరిగి చూచు
నవలి కరుగుచోఁ ద్రోవ కడ్డవడి నిలుచు
వలపు మీఱంగఁ జెలి మరుల్గొలుపుకొనుచుఁ
గోదెప్రాయంపుజంగమకులవిభుండు. 123

క. క్రొమ్మావికొమ్మచివు రదె
కొమ్మా కెంగేల నందుకొమ్మా యని మే
లమ్మాడు జిలుఁగుపయ్యెదఁ
గ్రమ్మినవలిగుబ్బదోయిఁ గనుఁగొను వేడ్కన్. 124

వ. ఇత్తెఱంగున హొరంగునం జెలంగి మెలంగు జంగమపుంగవుం గనుంగొని
యంగనా మణు లి ట్లనిరి. 125

క. ము న్నెప్పుడుఁ గొమ్మలతో
నెన్నికగాఁ దిరిగినాఁడ వేమి బళా! మేల్
కన్నెలవెంబడిఁ బడి కదు
మున్నతికెల మెలఁగె దిట్లు మోసంబు గదా! 126

క. కొంచక ము న్నెందఱి భ్రమ
యించితివి గదా! చెలంగి యీ వేసమునన్,
మంచిది నీదత్తురము లొ
కించుక మాయెడల సాగ వే లామాటల్. 127

సీ. కరతాళగతు లెసంగఁగఁ దందనా ల్పాడి చొక్కుచుఁ జిందులు ద్రొక్కె దేమి
కిలకిల నగుచుఁ గన్గీట సన్నలు సేసి వలిపువ్వుఁబొదలకుఁ బిలిచె దేమి

గరువంపుఁజిన్నరాగము దీసి యబ్బురపాటుగాఁ గిన్నెర మీటె దేమి
చెలరేఁగి గురవప్ప! శివ! యంచు నటువలె వెడవెడ గంతుల వేసె దేమి

గీ. కడిఁదియొయ్యార మేపార నదరి మంచి
విరులబంతులఁ దెమ్మని వేఁడె దేమి
జోగులెచ్చుట యిల్లాలిజోటు లెచట
కానిబుద్ధులు మాని వేగంబె చనుము. 128

క. అన విని జంగమ తేఁ డా
ననబోఁడుల నీసడించి నగుచుం గన్యా
జనచూడారత్నంబుం
గనుఁగొని వెండియును నేర్పు గదురఁగఁ బలికెన్. 129

ఉ. అంగన! నిన్నుఁ గంటి నెఱియం గనుపండువు గాఁగ నేఁడు నీ
బంగరు బొంగరాల కెనవచ్చుమిటారపుగబ్బిగుబ్బ లు
ప్పొంగఁగఁ గౌఁగిలించి వలపుల్ దళుకొత్త సుఖింపఁజేయవే
జంగమవారిపాపఁడ భుజంగకలాపమనోజ్ఞభూషుఁడన్. 130

క. వెండియుఁ బైఁడియు నాయెడఁ
గొండలవలె నుండు మెండుకొని యెప్పుడు నో
యండజగామిని! చూడ న
ఖండమహోన్నతవిభూతిఁ గలవాఁడఁ జుమీ 131

గీ. ఎండకన్నును నీడక న్నెఱుంగకుండ
గరిమ నుండుదుఁ దలపువ్వు గందకుండ
నెలంత నన్నేలు చిరసుఖాన్వితునిజేసి
నిన్ను నే ప్రొద్దుఁ దలమీఁద నిలుపుకొందు. 132

గీ. అంబుజాక్షి! కుబేరునియంతవాఁడు
బలియుఁ డొక్కఁడు చెలికాఁడు గలఁడు నాకు
మఱియుఁ దఱలని సిరి గలసెఱ యనుంగు
గలఁడు గద! నాకు బ్రహ్మను గన్నవాఁడు. 133

క. మేనెల్లఁ దెల్లఁ బాఱెను
గానంబడ దిప్పు డొక్కకన్నులకంబుల్

జానరవిజడలుకంటెను
జానరో నినుఁ గోరి పైదొసంగులు వడుటన్. 134

గీ. అన్న మెన్నఁడు నెఱుఁగ నీ యానఁగన్ను
దెఱవ వెఱతును మంటచేఁ దెఱలుచుండు
మేను సగమయ్యెఁ గుత్తుకలోనిచేఁదు
వదల దలివేణి! నీ మీఁదివలపు కతన. 135

క. పులికిని భూతంబునకున్
బలితపుమత్తేభమునకుఁ బాముఁన కెదలోఁ
దలఁకక తిరిగెద నెప్పుడుఁ
బొలఁతీ నీమీఁదివలపు పొరిఁబొరిఁ బెరయన్. 136

శా. రావే మత్తచకోరచారునయనా! రావే జగన్మోహినీ!
రావే రాజమరాళశాబగమనా! రావే లతాంగీమణీ!
రావే పూర్ణసుధామయూఖవదనా! రావే మిళిందాలకా!
నా వెంటన్ లతికాగృహంబునకుఁ గందర్పాహవక్రీడకున్. 137

క. మారుని నే మును గెలిచితి
వైరము దీర్పంగఁ బూని వాఁ డిపు డెదిరెన్
హా రమణీ! రతిరమణుని
హోరమణీ! నన్ను రతుల నలరింపఁగదే. 138

సీ. కొమ్మకొమ్మనికమ్మ కెమ్మోవిపానకం బెమ్మెతోఁ గ్రోలంగ నియ్యరాదె
తళతళల్ దులకించు బెళుకువాల్గన్నుల సొంపార మోమెత్తి చూడరాదె
నిక్కుచక్కనిగుబ్బ లక్కునఁ గదియించి బిగియారఁ గౌఁగిటఁ బెనచరాదె
ఘనజఘనస్థలఘటితనీవీబంధ మెదలించి మరుకేళి నెనయరాదె

గీ. చిల్కుచిల్కునఁ దేనియల్ చిలుకఁ గులికి
పలుకఁగారాదె సిగ్గు నిప్పచ్చరముగఁ
జెలులటక్కులఁ దలఁపున నిలుపఁబోక
మానినీమణి! తమిఁ దీర్చి మనుపు మిపుడు. 139

క. అగ్గలపువలపు సొలపులఁ
బెగ్గలి నిను వేఁదుకొనెదఁ బ్రియమారఁగ నన్

బిగ్గఁగవుంగిటఁ గూర్పవె
సిగ్గెల్లను వీడనాడి చిగురుంబోఁడీ! 140

క. న న్నన్యుం గా నెన్నక
సన్నక సన్నగను గోర్కె సమకూర్పవె నీ
కన్నెఱికపుము న్నెఱికపు
ము న్నెఱికలు సూపనేల ముద్దులబాలా! 141

వ. అని యనేక ప్రకారంబులఁ బ్రార్థించిన నమ్మించుఁబోఁడి యించుక తల వంచి యూరకున్న సంగడికత్తియ లజ్జంగమేశ్వరున కి ట్లనిరి. 142

క. జంగమదేవర వని యొక
భంగిం దాగితిమి గాక బాపురె నిన్నున్
భంగించి పొందఁదఱుమమె
లొంగక మఱియొక్క రైన లోకం బెఱుంగున్. 143

క. అఱమఱ లేటికి మాతో
మఱిమఱిఁ గొఱగాని వెడఁగుమాటలు పలుకన్
వెఱవవు మంచిదె మాచే
నెఱిఁగెదు గద యింక నిపు డహీనగుణాంకా! 144

చ. సరిసరి మంచిజాణవే విచార మిఁక కేటికి నన్యకామినీ
సురతవిహారలంపటతఁ జొక్కుచు మేలము లాడవచ్చె నీ
కరణి మెలంగుచుండుటకుఁ గా దనువారలు లేరు ధాత్రిపై
హరిహరి యింతదుండగపుటాటలఁ గంటిమె యెందు నేనియున్. 145

క. తిరుసుక దినునీ వెంతర
కర మరుదుగ నుదుటఁ గన్ను గలవాఁ డైనం
దరలి చనఁగలఁడె మాతో
విరసించి యహహా! కడిందివింతలు పుట్టెన్. 146

క. కావరమున మాచెలిపై
నీవిధమునఁ గన్ను వేసి యెలవించెద హా!
మావారు విన్న జంగమ
దేవర ననుకొన్న నీకుఁ దిప్పలు రావే. 147

వ. అనిన నజ్జోగిరాయండు వారల కి ట్లనియె. 148

మ. పలుచందంబుల వేఁడుకొన్న నకటా బాలామణిం గూర్పకే
చల మారం గలఁగిం(హి) పఁ జూచితిరి వాచాలత్వము ల్మీఱ నె
చ్చెలు లి ట్లందఱు మీరు గల్గుటకు రాజీవాననం గంతువా
లలరుందూపులపాలఁ బో నిడెదరా హా! యెంత గయ్యాళులే. 149

మ. కలకంఠంబులు శారికల్ శుకములుం గాదంబముల్ భృంగముల్
బలము ల్తోడుగ వెంట నంటి కొలువన్ బాలానిలంబు ల్కెలం
కుల రాఁ బంకజవైరి మింట వెలుగం గో యంచుఁ బెల్లార్చి మీ
కలకంఠీమణిపై మరుం డెదురుచోఁ గాపాడఁగా నేర్తురే? 150

వ. అని పలికి వెండియు గంగం గనుంగొని. 151

క. ఉన్న విధంబున వేఁడిన
సన్నక నన్నుఁ గనుకోర్కె సమకూర్పక హా!
మిన్నంది పొంగి పొరలెద
వన్నన్న! గణింప బల్లయాళివి గదవే. 152

క. తాఱుచుఁ బూపొదలెల్లను
దూఱుచు బలితంపుఁ జెట్లతుది కెక్కి వడిం
జాఱుచుఁ బెద్దలయానతి
మీఱుచు విహరింప నీకు మేరయె చెపుమా. 153

క. పలుమార్ బతిమాలిన లోఁ
గలఁక వహించుకొని లోతు గనబడనీ కీ
మలకలఁ బెట్టెదు నీకు
న్నిలువెల్ల విషంబు గదవె నీరజగంధీ! 154

క. విను విను నాపలు కిప్పుడు
వనజాతముఖీలలామ! వాలెము నాతోఁ
బెనఁగొనఁగఁ జనిన నవ్వుల
ననిశము భంగములపాల నడలెదవు సుమీ! 155

గీ. అనినఁ జిఱునవ్వు లోలోన నడచుకొనుచు
గంగ తనతక్కు క్రొవ్వాడికలికిచూపు

లతనువిరిగల్వతూపులై యతని గాఁడ
నింపు దీపింప మెల్లన నిట్టు లనియె. 156

క. భళి భళి! సర్వజ్ఞుఁడవే
పలుకుల కింకేమి లాతి పడుచులవెంటన్
వలగొని తిరిగెదు నిన్నీ
యిల ఁగాదనువారు లేరె యెంతటివారున్. 157

గీ. పరసతీలోలుఁడవు నీవు పాళిమీఱ
నచలసంస్థితి సానుల నంటి తిరుగఁ
జెల్లుగా కిట్టు లిల్లాండ్రఁ జేరి మెలగఁ
జనునె నీ నెయ్య మిఁకఁ జాలుఁ జాలుఁ బొమ్ము 158

గీ. అని పలుకుచున్నచోఁ జెలు లద్దిరయ్య!
జోలెజంగంబు నీ కింతజోలి యేల
సరి భళా! పదపద రె యం చరిదిహొయలు,
గదురఁ జనుదెంచి రిండ్లకు గంగఁ గూడి. 159

క. అత్తఱి జంగమరాయఁడు
చిత్తము తత్తరముఁ జెందఁ జిడిముడిపడుచున్
బిత్తరిహొయ లెదఁ బెనఁగొన
మెత్తంబా టూని చనియె మెల్లనఁ బురికిన్. 160

వ. చని యొక్క వివిక్తదేవతాగారంబున నుపవిష్టుండై యుండె నని సవ్యసాచికి గాంగేయుం
డెఱింగించిన నతం డతని నవ్వలికథావిధానం బె ట్లని యడుగుటయును. 161

## ఆశ్వాసాంతము

మ. శరదిందూపమదేహ! నిర్జితవిపక్షవ్యూహ! కైలాసభూ
ధరశృంగాటకగేహ! దీనజనసంత్రాణామితోత్సాహ! భా
స్వరగోవల్లభవాహ! పర్వతసుతాసంభోగకేళికళా
నిరతాభ్యంచితమోహ! సారబలనిర్భిద్రాగ్రబాహార్గళా! 162

క. కరుణావరుణాలయ! గిరి
శరణా! శరణాగతార్తజనఘనభయసం

హరణా! తరుణాభామృత
కిరణాభరణా! సమగ్రకీర్తిస్ఫురణా! 163

మా. పురదనుజవిభంగా! భూషితోద్యద్భుజంగా!
సురుచిరధవళాంగా! సూరిచేతోఽబ్జభృంగా!
కరకలితకురంగా! కాంతగంగోత్తమాంగా!
తరణిశశిధరాంగా! దైవవేశ్యాభుజంగా! 164

గద్యము - ఇది శ్రీమత్కుక్కుటేశ్వర కరుణాకటాక్ష నిరీక్షణ సంలబ్ధ సరసకవితా సామ్రాజ్య ధురంధర, ఘనయశోబంధుర, కౌండిన్యసగోత్రపవిత్ర, కూచిమంచి గంగనామాత్యపుత్ర, సకలసంస్కృతాంధ్రలక్షణకళాకౌశలాభిరామ తిమ్మకవి సార్వభౌమప్రణీతంబైన శివలీలా విలాసం బనుశృంగారరసప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

* * * *



శ్రీః

# ద్వితీయాశ్వాసము

క. శ్రీరాజితగుణసంగా!, ఘోరాఘతమఃపతంగ! కుతలశతాంగా!
తారేశహారనారద, హీరాభశుభాంగ! కుక్కుటేశ్వరలింగా! 1

వ. అవధరింపుము పాండునృపాలనందనునకు గంగానందనుం డి ట్లని చెప్పం దొడంగె నట్లు శాంబరీజంగమేశ్వరుండు వివిక్తదేవతాగారంబున వసియించి యున్న సమయంబున. 2

గీ. సకలలోకాధిపతియైన శంకరుండు
గంగకై బిట్టు వంతలఁ గలఁగుచుండెఁ
బగలుసేయుట తగ దని పఱచె ననఁగఁ
గమలహితుఁ డస్తశైలశృంగమునఁ జేరె. 3

గీ. కాలకంఠుండు జాలరికన్నె తనకు
నబ్బు నని యుబ్బి తాండవం బాడుచున్నఁ
జదలఁ బర్విన కెంజాయజడ లనంగ
నంబరస్థలి సాంధ్యరాగంబు మెఱసె. 4

గీ. చిగురువిల్కాఁడు దన తొంటిపగఁ దలంచి
విశ్వరూపంబు దాల్చి కోవెలలు నళులు
గ్రమ్ముకొని కొల్వఁ జంద్రశేఖరునిమీఁదఁ
గడఁగి దండెత్తె ననఁగఁ జీఁకటులు పర్వె 5

క. సుర లపు డంబరకేశుని
శిరమునఁ బూజించుచున్నఁ జెన్నారెడు క్రొం
బరువంపుబొండుమల్లియ
విరు లనఁ దారకలు గగనవీథి న్మెఱసెన్. 6

క. హరునకు గంగకుఁ బెండిలి
సరగున నగు నని నిలింపసతు లారతు లీఁ
గరములఁ బట్టిన మేల్బం
గరుపళ్లెం బనఁగఁ దుహినకరుఁ డుదయించెన్. 7

గీ. భవుఁడు జాలరికన్నెకై బడల నొడలి
విరహపరితాపజనితపాండురమరీచు
లబ్బురంబుగ జగములఁ బ్రబ్బి ననఁగఁ
బండు రేయెండ లెల్లెడ నిండుకొనియె. 8

ఉ. జంగమరాయఁ డయ్యెడల జాలరి లేమయొయార మాత్మ వే
భంగుల నెంచి దర్పకుని బారికి బిట్టు చలించి యౌర! సా
రంగవిలోచనామణి పరాకున న న్గికురించి యేగునో
బంగరుపైఁటకొం గొడిసిపట్టి పెనంగక పోవనిచ్చితిన్. 9

ఉ. గద్దరిబోటికత్తియలు గ్రమ్మి నయమ్ముగఁ బెక్కులాగులన్
సద్దులు సేయఁగా బ్రమసి జంటఁ బెనంగఁగ నేరనైతి వే
సుద్దుల కేమి యీపలువజోటులపంతము దీఱె నేఁడు నా
బుద్ధికి మోస మయ్యెఁ గద బూమెలగీములు వామలోచనల్. 10

చ. మరుఁడు విరోధి చంద్రుఁడును మందసమీరుఁడు నేల నిల్వ రీ
పరభృతశారికానికరబర్హిమరాళశుకీమధువ్రతో
త్కరములు నాకు భూతములు కంజముఖీమణి బల్గయాళి హా
హరిహరి! యింక నీసరసిజాంబకబాధల కెట్లు దాళుదున్. 11

ఉ. ఏగతిఁ దాళువాఁడ నిపు డెవ్వరి నేక్రియ వేఁడువాఁడ న
బ్బా! గిరి నింక నెందు సులభంబుగఁ గన్గొనువాఁడ నెట్లు పై
వేగినదాకఁ దాకువెడవిల్తునితూపుల నోర్చువాఁడ నా
హా! గురులింగ! దానిహొయ లాత్మఁ దలంచిన గుండె ఝ ల్లనున్. 12

ఉ. హా వికచారవిందముఖి! హా మదమత్తమరాళగామినీ!
హా విబుధేంద్రనీలరుచిరాలకజాలక! హా విలాసినీ!
హా వరవర్ణినీజనశిఖాగ్రమణీ! రమణీ! ననుం గడున్
భావభవప్రసూనశరబాధల కగ్గముసేసి యేగితే. 13

క. చిరసుఖదాయిని వని నిను
నిరవొప్పఁగ వేఁడుకొనిన నిటు భంగములం
బెరయించి లోఁతు చూపక
దరిఁ జేర్పక సుళ్ళఁ బెట్టఁ దగునే గంగా! 14

క. నీకరుణామృతధారా
శీకరములఁ బైనఁ జిల్కి చెచ్చెరఁ దాపో
ద్రేకము చల్లార్పం గదె
రాకాహిమధామసమతరంగా! గంగా! 15

వ. అని మఱియు విరహావేశంబున 16

ఉ. ఎక్కడ నల్కుడైన జలజేక్షణ వచ్చె నటంచు లేచి న
ల్దిక్కులు సూచి కానియెడ దీనత నుస్సురటంచు నూర్చు నే
చక్కిట నెద్ది గన్గొనినఁ జాన శుభాకృతిగాఁ దలంచు హా!
చక్కెరబొమ్మ! యంచుఁ బలుచందములం బలవించు సారెకున్. 17

ఉ. కన్నులు మూయుఁ ద్రుళ్ళిపడి గ్రక్కున దిక్కులు రోయు నూరకే
సన్నలు సేయుఁ బై వలువఁ జయ్యన నవ్వలఁ ద్రోయు మింటిపై
వెన్నెలఁ గాయుచందురుని వేఁడికిఁ దాఁ బెడఁబాయు నద్ది రా
చిన్నెల జంగమప్రభునిచిత్తవికారము లెన్నఁ జిత్రముల్. 18

క. అళికీరశారికాపిక
కలహంసమయూరకోకకలరవకురలీ
కులరవముల కులికిపడుం
జలిమలయల్లుండు గుండె ఝు ల్లని లీలన్.. 19

వ. మఱియును. 20

క. మదనా! దాసకులాంబుజ
వదనామణికొఱకు నేను వందురఁ బోనీ
కదనా యిటు లేఁపంగ నఖ
గద నాచే నైనతొంటికత మఱచితివా. 21

గీ. మొదల నిలమీఁదఁ బడఁదన్ని పిదప నాద
రించి తలనుంచుకొనుటకు మంచి లెక్క
హా! గురుద్రోహి వగుటెల్ల నగపడంగ
నన్ను బన్నంబు నొందింపఁ జన్నె చంద్ర! 22

వ. అని బహుప్రకారంబుల మనోవికారంబులం బొరలుచుండె నంత నిక్కడ. 23

గీ. గంగ ముద్దుగుల్కెడు నాజంగమయ్య
చెలువు మది నెంచి వలపులు చెంగలించి
యంగభవశాతచూతసాయకపరంప
రావికంపితహృదయరాజీవ యగుచు. 24

చ. కళవళపాటుతో నులకకంకటిపై మెయిఁ జేర్చి తద్దయున్
సొలయుచు మోవిమానికపుసొమ్ములు వే సడలించి వైచి యూ
ర్పులు నిగుడించుచుం జెలిమిబోటుల బిట్టు సళించుచుం గడున్
వలపులవెచ్చ హెచ్చ మదవారణయాన మదిం జలించుచున్. 25

క. చిలుకలు నంచలు రొదలుచుఁ
బిలిచిన మాటాడ నోడి బెగ్గిలుచు మదిం
గలఁగుచుఁ బందుచు లేచుచు
బలవించుచు వగలఁ బొగిలి బాములఁ బడుచున్. 26

మ. తలయూఁచుం దనలోనఁ దానె నగుఁ జెంతం జేరఁగానీక నె
చ్చెలులం దిట్టుఁ గనుంగవం బడిబడిం జిప్పిల్లుబాష్పాంబువుల్
తెలివారుం గొనగోళ్ళ మీటుఁ బొగలున్ దివ్యప్రతాపోజ్జ్వల
జ్జలజాతాంబకశాతచూతవిశిఖస్ఫారానలజ్వాలలన్. 27

వ. ఇట్లు విరాళిం గ్రాలుచుండి మఱియుం దనలోన. 28

ఉ. ఏటికిఁ బువ్వుఁబొంపునకు నేఁగితి, నేఁగిన నందు నీటునం
బాటిలుచున్న క్రొందలిరుఁబ్రాయపుజంగము నేలఁ గంటి, న
మ్మేటి నటు ల్గనుంగొని తమిం గవగూడక యేల వచ్చితిన్,
బూటకపుంబొలంతుకలు బూమెలఁ బన్ని రిఁ కేమి సేయుదున్. 29

వ. అని జంగమేశ్వరుం గురించి యి ట్లనియె. 30

గీ. చిగురువిల్కాని గెల్చు నాసొగసు కాఁడు
లీల మై వచ్చి న న్నుతిమాలుకొనిన
బేల నై యేలఁ బొమ్మంటి జాలిమాలి
చెల్లఁబో నింక నే నేమి సేయుదాన. 31

ఉ. అక్కట! గబ్బిగుబ్బగవ నక్కునఁ జేర్చి కవుంగిలించి క్రొం
జక్కెరమోవిపానకము సారెకుఁ జాల నొసంగి వానితోఁ

జక్కెరవింటిమేల్బిరుదుసంగరలీల సుఖింపకున్నచో
గ్రక్కున నాకు నీసుమశరప్రదరానలతాప మారునే. 32

ఉ. కిన్నెర మీటుచు న్వగలఁ గేరి యలంతిగఁ బాటఁ బాడుచున్
సన్నలు సేయుచు న్బిగువుచన్నులపైఁ గనువేసి డాయుచున్
సన్నక నన్నుఁ బూఁబొదలచాయకు ర మ్మని వేఁడునీహొయల్
గన్నులఁ గట్టినట్టు లగు గద్దరిజంగమరాయ! సారెకున్. 33

ఉ. ఇందునిభాననామణుల నెందఱి నెందఱి ము న్భ్రమించి శ్రీ
నందనుఁ బాఱఁద్రోచితివి న న్నటుల న్వలయించి నెమ్మదిం
గొందల మందఁజేసి యెటకో చనుదెంచితి నీతుటారపుం
జంద మెఱుంగ నైతిఁ గద జంగమరాయ! సతీమనోహరా! 34

క. మారాశుగశుకమధులి
ట్పారావతపికమరాళబర్హిమరున్నీ
హారాంశులసడి కళికెద
రారా నన్ బ్రేమ నేలరా రభసమునన్. 35

గీ. పూలు పన్నీరు గందంబుఁ బోఁక లాకు
లనఁటి పండులుఁ జక్కెర యగరుఁ గప్పు
రంబుఁ గస్తురిఁ గూర్చి యర్చన లొనర్తు
రార వైళంబ జంగమరాయ! యిపుడు. 36

వ. అని వగలం బొగులుచున్న మగువం గనుంగొని సఖీశిఖామణులు దమలో ని
ట్లనిరి.

గీ. కూళజంగంబు వాలారుగోళ్ళనిండ
వలపుమం దేమొ చల్లి యిక్కలికి నిట్లు
మరులు గొల్పెను గాఁబోలు మాయగాండ్రు
జోగులను నమ్మవచ్చునె సుదతులార! 38

గీ. ప్రేతభూతములఁ దిరుగుచు భూతకోటి
వెంటఁ జనుదేర వేల్మిడి యొంటిఁ బూసి
తోళ్లుఁబునుకలు నెమ్ములుఁ బెల్లుఁ దాల్చు
జోగులకు మందుమంత్రముల్ జోలె నుండు. 39

వ. అని గంగం గమంగొని. 40

గీ. ఏమె నీనెమ్మనాన సీ గ్గింతలేక
వాసిఁ దిగనాడి పొగలెదు గాసిఁబడుచుఁ
బెద్ద లెన్నంగఁ దగిన నీ బుద్ధి విడిచి
చిడిపిజంగంబు దా నేమిసేసె నొక్కొ 41

గీ. తల్లిదండ్రులు గులము పెద్దలును మఱియుఁ
దగిన చుట్టంబులును విన్నఁ దప్పు కాదె
చిన్నదానవు నీ విట్లు సిగ్గుమాలి
పలుదెఱంగుల నొరలంగఁ బాడి యగునె. 42

క. కటకట పిడికెడుకూటికిఁ
గోటికెలఁ బడి టికిర మెత్తుకొని మనియెడు న
మ్మటుమాయజంగమునకై
యిటువలెఁ గృశియింపఁ దగునె యిందునిభాస్యా! 43

గీ. వద్దు మాయమ్మ! యింక మంచిబుద్ధి గలిగి
దత్తురపుజంగమయ్యపైఁ దలఁపు విడిచి
నెమ్మి నుండుము శుభములు నివ్వటిల్లు
జోగు లెచ్చుట నాడెంపుజోటు లెచట. 44

సీ. కటకట! వాఁకటఁ గస్తి వొందఁగ నేల వెసఁబట్టి దోశంబు మెసఁగ రాఁదె
యొడలెల్ల బిగిదప్పి బడలి యుండఁగ నేల యగరుగస్తురిగంధ మలఁద రాదె
సొగసెల్ల విడిబాఱ వగలఁ గుందఁగ నేల వెల లేనిరవణము ల్పెట్ట రాదె
తలయెల్ల జడగట్టి మలిన మొందఁగ నేల తీరుగాఁ గ్రొమ్ముడి దిద్ద రాదె.

గీ. గట్టివలిపట్టుపుట్టము ల్గట్ట రాదె
చెలఁగి కపురంపుఁ దములంబు సేయ రాదె
దావిక్రొంబువ్వుసరములఁ దాల్ప రాదె
యువిద! నీ కిది యేలాటియోజ చెపుమ. 45

చ. చిలుకలఁ గొట్టె దేమి దరిఁ జేరిన బోటులఁ దిట్టె దేమి పె
న్వలపులఁ బొక్కె దేమి తలవంచి మదిం గడుఁ జొక్క దేమి యూ
ర్పుల నిగుడించె దేమి కనుబొమ్మలసారె ముడించె దేమి హా!
చిలుకలకొల్కి! నీవెడఁగుచిన్నియ లిన్నియుఁ జెప్పఁ జిత్రముల్. 46

వ. అనిన వారల కాకన్యకామణి యి ట్లనియె. 47

క. చెలులార! యింత సెగ్గులు
గొలకంగా నేల లచ్చికొమరుని కెనయౌ
చెలువము గలయవ్వలఁతికి
వలసితి మీతోడ నింక వాదము లేలా. 48

గీ. వినుఁడు నా మాట మీరెల్ల వీను లలర
నలినముఖులార! నా ప్రాణనాథుఁ డైన
జంగమస్వామిఁ దెచ్చి యోర్వంగరాని
మదనవిశిఖార్తి మరలించి మనుపరమ్మ! 49

ఉ. బంగరుపట్టుపుట్టములు భాసురరత్నవిభూషణంబు లు
ప్పొంగఁగ మీకు నిచ్చి పరిపూర్ణకృపామతి నాదరింతు నా
లింగముతోడు నా పలుకు లెస్సగ నమ్ముఁడు బోటులార! యా
జంగమరాజశేఖరుని జయ్యన నిచ్చటఁ దెచ్చి నిల్పుఁడీ. 50

క. ఇవ్విధము గాకయుండిన
నవ్వల అవ్వలఁ బెనంచి యందఱిలోనన్
నవ్వులఁ బెట్టక యూరకె
పువ్వారంబోఁడులార! పొం డిరవులకున్ 51

మ. కుల మెల్ల న్నిరసించి గేలి యిడ నీ కోపంబు దీపింప మా
తలిదండ్రుల్ నిలయంబునం దిడక పంతంబారఁ బోఁదోల నీ
చెలికత్తెల్ మతి మీర లందఱును ఛీఛీ యంచు దూషింప నీ
వలతేని న్నగువానికౌఁగిటను నే వాలంబు గ్రీడించెదన్. 52

వ. అని కనరు గనంబడం బలికిన నళికి చెలికత్తియ లొండొరుల మొగంబులు చూచు కొనువారును, గుజగుజలం బోవువారును, సళించువారును, నీసడించువారును, నిదె మిడిమేళం బనువారును నై యుండి యలసి కొంత తడవున కించుక గనుమూసి నిదురింపం దొడంగి రా సమయంబున. 53

క. గంగయు గడితపువలువచె
అంగు ముసుంగిడి కడిందిఱాతనమున నా
శృంగారవనికి మెల్లనె
జంగమపుంగవుని వెదుకఁ జనియె నొకర్తై. 54

వ. అట్లు చని వనిం బ్రవేశించి. 55

సీ. కొదుగక గాటంపుఁబొదరిండ్లదండల గొదకొని సారెకు వెదకి వెదకి
తిన్ననికపురంపుఁదిప్పలచొప్పుల నిలుచుచు నందంద నెమకి నెమకి
వలపుగొజ్జఁగినీటివంతల చెంతల డాసి పల్దెఱఁగుల రోసి రోసి
పరువంపువలిదాఁక పందిళ్లు సందుల సొలయుచు మఱిమఱిఁ జూచి చూచి.

గీ. వలపు లంతంత కుబ్బ నవ్వన్నెకాని
నెందుఁ బొడఁగానఁనేరక కుంది కుంది
యిందువదన వనితరు బృందములను
అశ లడరంగ నిట్లని యడుగఁదొడఁగె. 56

సీ. చిన్నారివగకాఁడు చెన్నార మీవద్ద నిలిచియుండఁడు గదా నిమ్మలార!
సింగారములకుప్ప చెలువొప్ప మీదండ మొనసియుండఁడు గదా పనసలార!
ముద్దుజంగమతేఁడు మురిమీఱ మీపజ్జ మసలియుండఁడు గదా మావులార!
నెఱజాణతలమిన్న నీటార మీచెంత దాఁగియుండఁడు గదా దబ్బలార!

గీ. యలరువిలుకానిఁ దెగడుసోయగము గలిగి
కడిఁదిమీచాయనిగ్గులు కదలఁ బర్వ
జగములెల్లను వలయించుజగమగండు,
మీకడకు రాఁడు గద వలిదాఁకలార! 57

క. ఈ డెన్న రానిసొగసుల
నాడెందము గరఁగఁజేసి నలిఁ బెట్టినయా
పోడలతలమానిక మిపు
డీడా నీనీడ కీడ కేతేరఁడుగా. 58

క. అన్నన్న! కడిఁదివగలన్
నన్ను న్వలయించి చనుట నాయమె వానిం
గన్నారఁ జూపఁగదవే
పొన్నా! నీ కెన్నరానిపుణ్యంబు గదే. 59

క. జగమెల్లను వలయింపఁగఁ
దగుసోయగమున వెలుంగుదంటవిరాళిం
బొగలించి చనియె వానిం
బొగడా! గనఁజేయునీకుఁ బొగడిక వచ్చున్. 60

గీ. తలిరువిల్కానిదాడికి నళికి యుళికి
పలుదెఱంగుల నినుఁగోరి వలసియున్న
చెలియ నలయింపఁ దగదని తెలిపి వాని
నగపడఁగఁజేయరే తొమ్మటనఁటులార! 61

వ. అని మఱియును జంగమేశ్వరుం గుఱించి యి ట్లనియె. 62

ఉ. ఏలర యింతవింతచల మేలర నన్ను మనోభవానల
జ్వాలలవేఁడిమిం బొగలఁ జాలర లేజవరాలరా మదిం
జాల దిగు ల్దగుల్కొనియె జాలముసేయక వేగ వచ్చి నా
మ్రోలఁ గనంబడం గదర ముద్దులజంగమరాయ! మ్రొక్కెదన్. 63

ఉ. పొంగుచు నీ ముఖాంబుజము ప్రొద్దునఁ జూచినవేళ యెట్టిదో
యంగజుఁ డెంతయుం గుపితుఁ డై వెనుదీయక యేఁచఁజొచ్చె న,
న్నంగనలం గలంచి యిటులా రెదఁబెట్టెద వేల చాల నీ
సంగతిఁ గోరుకొంటిఁ గద జంగమరాయ! విలాసభాసురా! 64

గీ. అనుచు వనమెల్లఁ ద్రిమ్మరి యందు నెచట
జంగమస్వామిఁ గానక గంగ యలసి
చాల నొప్పారుబాలరసాలసాల
మూలమునఁ గొంగు పఱచి కన్మూసి యుండె. 65

క. మఱుఁ డపు డిందీవరసర
సీరుహహసితోత్పలాస్త్ర శితవిశిఖంబుల్
పొరిఁబొరి వెడవింటఁ దొడిగి
కరిగామినిఁ బింజెపింజె గాఁడఁగ నేసెన్. 66

క. అటు వేసిన హా! యని య
క్కుటిలాలక సోలి తెలిసి కుసుమాస్త్రనిశా
విటమధుకరహంసరుహూ
రటమలయానిలులఁ గినుక ప్రబ్బఁగఁ బలికెన్. 67

గీ. పార్వతీశంకరులమీఁదఁ బఱచి మున్ను
బన్నమందిన నద్దిలోపలను మఱచి
యిపుడు నా మీఁదఁ దొడిగెద విక్షుచాప
మింక నీ వేమి యయ్యెదో యెఱుఁగరాదు. 68

క. సోమా! నీవును నేనును
గామాంతకుశిరముమీఁదఁ గలసి మెలసి మున్
బ్రేమమున నుందు మిప్పుడు
నామీఁద న్వేఁడిచూప నాయమె నీకున్? 69

సీ. మరుని శంభునికంటిమంట మ్రింగెడునాఁడు తాఱి మీ రేబొక్క దూఱినారు
దర్పకుఁ డభవుచే దగ్ధుఁ డయ్యెడునాఁడు తలఁగి మీ రేయేటఁ గలసినారు
వలరాజు హరునిచే నిలిగిపోయిననాఁడు సురిగి మీ రేకోనఁ జొచ్చినారు
మదనుఁ డీశ్వరునిచే మడిసి పోయిననాఁడు పాఱి మీ రేతిప్పఁ బట్టినారు.

గీ. వాఁడు గ్రమ్మర జీవించి వచ్చినపుడు
సిగ్గు లే కిట్లు వెంబడిఁ జేరినారు
మధుపచక్రాంగపరభృతమలయపవను
లార! గణుతింపఁదరమె మీబీర మిపుడు. 70

వ. అని యనివారితానంగసంతాపాటోపంబునం బొరలుచుండె నంత. 71

గీ. ఆత్మగృహమున నక్కడ ననుఁగుచెలులు
త్రుళ్ళిపడి లేచి సెజ్జయు నెల్లచోట్లు
వెదకి గంగను గానక వెఱఁగు మీఱ
వరుస నందఱు శృంగారవనము సొచ్చి 72

సీ. కందర్పశరబాధఁ గుందుచు నందంద శివశివా! యని సద్దు సేయుదానిఁ
బొగలుచు గడితంపుబుడిబుడివేఁడికన్నీటిజాల్ కొనగోర మీటుదాని
నెందు నల్కుడు విన్నఁ బొందుగాఁ జెవియొగ్గి పొంచి నల్గడ లాలకించుదానిఁ
బొరిఁబొరి నిలమీఁదఁ బొరలుచు లేచుచు నుసురంచు నిట్టూర్పు లుచ్చుదానిఁ

గీ. గమ్మకపురంపుబలుదుమారమ్ము చిమ్మి
క్రమ్ముకొని వీచువలిగొను తెమ్మెరలకు
నదలి యెదరార గడగడవడకుదానిఁ
జిన్నికన్నియఁ గాంచి రాచిగురుఁబోండ్లు. 73

గీ. కాంచి మెల్లన దరి కరుదెంచి లోని
జడుపు దీరంగఁ బుప్పొడిఁ దడిసి వైచి
మెదవుగపురంపుబూఁది నెన్నుదుటఁ బెట్టి
యిందుబింబానలు దాని కిట్టు లనిరి. 74

ఉ. అమ్మకచెల్ల! నీ విటు గయాళితనమ్మున మమ్ముఁ బిల్వకే
ముమ్మర మైనవేదనల మున్గుచు నీనడురేయిఁ గోనకున్
నెమ్మది నొంటి రాఁదగునె నీమదిలో నళు కేల లేదె హా!
కొమ్మ! వచింపఁ జిత్రము లగుంగద నీదుకడింది చందముల్. 75

క. చిలుకలు గొరువంకలు గో
యిల లంచలు నెమలిగములు నెడపక యెపుడున్
గొలగొలలాడుచు విరహుల
నిలువఁగ నిచ్చునె వనంబు నీకుం గొఱయే. 76

గీ. కొసరి యిట్టి పుప్పొడి కేలుగొనుచు నొక్క
యెడను గాలూనం గందదు బడి చరించు
జోగిజంగాల కిరవైనచోటు గదవె
పడఁతి యిఁక వానిపై నాస విడిచి రమ్ము. 77

గీ. అమ్మ! నీయింట సకలభాగ్యములు గలవు,
దండ్రి యందఱిలో నెన్నఁదగిన ధనికుఁ,
డింకఁ దగుచోటఁ గళ్యాణ మెలమిఁ జేయు,
వద్దు రావమ్మ! యింటికి బుద్ధి గలిగి. 78

వ. అని యూరడించి నెచ్చెలు లచ్చేడియ నింటికిం దోడ్కొనితెచ్చి యిష్టగోష్ఠి ప్రకారంబులఁ
బ్రొద్దుగడపుచుండి రంత. 79

ఆ. వేగుచుక్క వొడిచె విడువక తామ్రచూ
డంబు లఱచె నిరులడంబు మాసెఁ
దూర్పు దెల్లవారెఁ దోయజమిత్త్రుండు
పొడపుఁగొండమీఁదఁ బొలుపుచూపె. 80

ఉ. అప్పుడు బోటినెచ్చెలులు హాళిని దాసకులాగ్రగణ్యుఁ డై
యొప్పెడుశంఖదేవుకడ నొయ్యనఁ జేరి కుమారిచందముల్
దప్పక చొప్పడం దెలిపి తా రట నేఁగిన నాతఁ డాత్మలో
ముప్పిరిగొన్న యంగదల మున్గుచు నేమియుఁ దోఁచకుండినన్. 81

గీ. కొంతతడవు విచారించి కూఁతుఁ బిలువఁ
బంచి కూర్చుండ నిడి బుజ్జగించి యొడలు

దడవి ముద్దాడి కొండొకదడవునకుఁ గు
మారికామణిఁ గాంచి ప్రేమమునఁ బలికె. 82

క. అమ్మా! నీతలఁ పేమియు
సమ్మతి గాకున్న దిపుడు స్వాంతంబున కే
నిమ్మాట విని కలంగుచు
రమ్మని పిలిపించినాఁడ రయమున నిన్నున్ 83

గీ. తల్లి! నీ వేమి! గోరినఁ దగిలి సేతుఁ
గాని యిక్కానిపని సేయఁ గాదు సుమ్ము!
కేరి మఱి యెద్ది యైనఁ గాంక్షింపఁ బోక
చిడిపిజంగమవానిఁ గాంక్షింపఁ దగునె. 84

క. కులమునఁ గల పెద్దలు విని
వెలిపెట్టినఁ గూడి పొత్తు విడినాడిన హా!
తలవంపు లయ్యెడుం గద
చెలియా! యీలాంటిబుద్ధి చెల్లునె నీకున్? 85

క. కులమును రూపంబును గల
చెలువుని రప్పించి పెండ్లిసేసెద నీకున్
జలజాక్షి! గానిబుద్ధులు
వల దిఁక నామాట వినుము వాలాయముగన్. 86

వ. అనినం దండ్రికి గంగ యి ట్లనియె. 87

ఉ. పొంగుచు మూఁడులోకములఁ బూనికతో విహరించి పాపముల్
భంగ మొనర్చుచు న్భువనపావని నా విలసిల్లుజాహ్నవీ
గంగను గాని నే మనుజకన్యను గాను నిజం బతండునున్
జంగమవాఁడు గాఁ డల భుజంగమరాజకలాపుఁ డారయన్. 88

గీ. తండ్రి! యిమ్మాటఁ గొంత చిత్తమున నీ వె
ఱింగినది గాక యూరక ఱిచ్చపడక
యతని రప్పించి వెస వివాహం బొనర్చు
నిఖిలవాంఛాఫలంబులు నీకుఁ గలుగు. 89

క. ఇటువలెఁ గాకుండిన నా
నిటలాక్షునిపాద మాన నీయాన మఱెం

తటిబలవంతుని నైనను
గటకట! నే నింక నొరుని గాంక్షింపుదునే. 90

వ. అనిన సంతసిల్లి శంఖదేవుండు వెండియుఁ గూఁతున కి ట్లనియె. 91

గీ. అమ్మ! యిమ్మాట నిక్కువం బయ్యె నేని
నతఁడు నిజమూర్తిఁ జూపించి యఖిలదివిజ
వర్గములఁ గూడి యింటికి వచ్చె నేని
ప్రేమ దైవార నే నిన్నుఁ బెండ్లిసేతు. 92

క. విను మూరక ని న్నొసఁగిన
జనులందఱు నవ్వఁ గులముసాములు నన్నుం
గనుఁగొని యెగ్గులు వల్కరె
వనితా! నీ వెఱుఁగనట్టివల నిఁకఁ గలదే. 93

ఆ. అనిన సంతసిల్లి యప్పుడు గంగాభ
వాని యభవు నాత్మలోనఁ దలఁచి
కరయుగంబు మోడ్చి స్థిరభక్తి దైవార
వినయసరణి నిట్టు లనుచుఁ బలికె. 94

సీ. సకలలోకారాధ్య! సర్వజ్ఞ! సర్వేశ! గిరిసుతాప్రాణేశ! దురితనాశ!
భూతభావన! పరంజ్యోతిస్స్వరూప! మహాదేవ! శంకర! హర! మహేశ!
జగదవనాధార! నిగమాంతసంచార! ఫాలలోచన! భర్గ! నీలకంఠ!
నందివాహన! భృంగినాట్యప్రమోద! గీర్వాణసంస్తుత్య! పురాణపురుష!

గీ. నాదబిందుకళామయ! వేదవేద్య!
చక్రధరబాణ! భక్తరక్షాధురీణ!
నామనోనాథ! కైలాసనగనివాస!
వేడ్క నవధారు దేవ! నా విన్నపంబు. 95

గీ. దేవ! మాతండ్రి యగు శంఖదేవుఁ డిపుడు
నాకు నీకును బెండ్లి యొనర్పఁ గోరి
తివురుచున్నాఁడు బ్రహ్మాదిదివిజవరులు
దవిలి గొలువంగ వేవేగఁ దరలిరమ్ము. 96

గీ. నీకు నామీఁదఁ బ్రేమంబు నెరయఁ గల్గె
నేని నే నీకుఁ బ్రియురాల నేని యిపుడె

పేర్మి దైవార జాలరివిభునిమ్రోల
నిలిచి నా మాట సత్యంబు నెరపవయ్య! 97

వ. అని గంగ ప్రార్థింపుచున్న సమయంబున. 98

సీ. హరియు బ్రహ్మయుఁ బురందరముఖ్యదిక్పతుల్ రవిసుధాకరముఖగ్రహపతులును
సనకాదియోగికుంజరులు వశిష్ఠాత్రిమైత్రావరుణిముఖ్యమౌనివరులు
వీరభద్రకుమారభైరవభృంగిరిటాదిప్రమథనాథు లప్సరసలు
గరుడకిన్నరయక్షగంధర్వఖచరగుహ్యకనాగసిద్ధవిద్యాధరులును

గీ. బలసి కొలునంగ నసమవైభవముతోడ
నందికేశ్వరు నెక్కి యానందలీల
సకలలోకాధిపతి యైనసాంబశివుఁడు
దాసకులమౌళిమ్రోలఁ బ్రత్యక్షమయ్యె. 99

వ. అట్లు సాక్షాత్కరించిన దాక్షాయణీవల్లభుం బొడఁ గాంచి పులకితాశేషావయవుండును, నిర్భరానందరసోత్ఫుల్లనేత్రుండును, విస్మయాకులస్వాంతుండును నగుచు దాసకుల జ్యేష్ఠుండు సాష్టాంగదండప్రణామంబులు గావించి బహుప్రకారంబుల వినుతించి కృతాంజలి యై యి ట్లనియె. 100

గీ. అభవ! నా భాగ్యమహిమ శక్యంబె పొగడ
హరిపురందరకమలాసనాదులకును
గనఁబడగరానినిన్ను నేఁ గంటి నిపుడు
పావనంబయ్యె నహహా! నావంగడంబు. 101

గీ. నీచకులయింటి కిప్పుడు నీవు వచ్చి
యొనరఁ గన్యార్థివై నిల్చియున్నవాఁడ
వేతెఱంగున నిన్ను సంప్రీతుఁ జేసి
(యు)యనుపఁ గలవాఁడ నయ్య చంద్రోత్తమాంగ. 102

వ. అని విన్నవించి యొక్క దివ్యమణిమయమందిరంబున విడియించి, సకలబుధ బాంధవామాత్యపురోహితసుహృజ్జనంబుల రావించి, శుభముహూర్తంబు నిర్ణయించి, నిజగృహాదికం బలంకరించి తదనంతరంబున. 103

సీ. శుభతూర్యనినదంబు లభినవస్థితి మ్రోయఁ గరదీపికాసముత్కరము వెలుఁగ
ద్విజసతీమణులు ముత్తైపుసేసఁబ్రాల్ సల్ల నుర్వీసురేంద్రు లాశీర్వదింప

1. యనుప - శ్రీ - మూ - పాఠం. యనుప - సావిత్ర పాఠం [illegible]

గణికానికాయ మగ్గలికనృత్యంబాడ వనజాతముఖులు నివాళు లొసఁగ
వందిమాగధులు కైవారంబు లొనరింప గాయకుల్ గానవైఖరులు నెరప

గీ. మంగళద్రవ్యములఁ గొంచు మఱియుఁ బుణ్య
కాంత లరుదేర నత్యంతకౌతుకమున
సకలబుధబాంధవాశ్రితసహితుఁ డగుచు
భవు నెదుర్కొనెఁ గైవర్తపరిబృఢుండు. 104

వ. అప్పుడు మహాదేవుండు దివ్యదుందుభిధ్వానంబులును, గంధర్వకిన్నరగానంబులును, రంభోర్వశీప్రముఖాప్సరస్సరోజాస్యాలాస్యావధానంబులును, జండీశ్వరప్రపఠిత గద్యపద్యనిధానంబులును, దివిజర్షభప్రవర్షితదేవతరుప్రసూనంబులును, దేవ విమానంబులును, నిరంతరమహోత్సవలీలాముహూర్తవత్ప్రమథభటసంతానంబు-లును, బృందారకసుందరీసందోహపరివేష్టితచిత్రమణివితానంబులును, ననూనంబులై చెలఁగ నందికేశ్వరారూఢుండై, యభినవవైభవంబున శంఖదేవునగరు ప్రవేశించి, యచ్చట వాహనంబు డిగ్గి, వివాహమంటపాభ్యంతరంబు సొచ్చి, సముచిత పీఠాగ్రంబున సుఖాసీనుఁ డై యున్నసమయంబున. 105

ఉ. అంగన లొక్కకొందఱు ప్రయత్నముతోడ నలంకరించి యు
త్తుంగవివాహవేదికి వధూమణిఁ దోడ్కొని తెచ్చి వేడ్క ను
ప్పొంగుచు నున్న యాచకులు భూసురముఖ్యులు నప్పురాంతకున్
గంగను బెండ్లిపీట నిడి కంకణముల్ దగఁ గట్టి రంతటన్. 106

గీ. శంఖదేవుండు దేవతాసార్వభౌముఁ
డగుమహాదేవునకుఁ బ్రియం బలరఁ గాళ్లు
గడిగి తనముద్దుబిడ్డను గంగ నపుడు
ధారవోసె నిలింపబృందములు వొగడ. 107

వ. అప్పుడు. 108

సీ. సిరియును వాణియుఁ జెలఁగి సేసలఁ జల్ల గురుఁ డొజ్జ యై లగ్న మరసి తెలుప
హరియు బ్రహ్మయుఁ బెద్దలై పనుల్ సమకూర్ప శ్రుతివాక్యములు వసిష్ఠుఁడు వచింప
శచియు నరుంధతీసతి నివాళు లొసంగ రంభోర్వసులు వింత రవళి నాడఁ
దుంబురునారదుల్ దొడరి గానముసేయ దేవదుందుభులు మేల్ఠీవి మొఱయ

గీ. హర్షమున విశ్వకర్మ దా నంది యిచ్చు
కనకమంగళసూత్రంబు గంగయఱుతఁ

గట్టి శుభ మొందె నసమానగరిమ మెఱయ
సకలభువనాధిపతి యైనశంకరుండు. 109

గీ. హరునితలన్ గంగయు న
త్తరుణిశిరంబున హరుండు దమిమీఱఁగ వా
విరిముత్తెపుఁదలఁబ్రా ల్పో
సిరి చిఱునగవులు దలిర్ప శివకరలీలన్. 110

వ. అట్లు విధ్యుక్తప్రకారంబున వివాహం బొనరించి, కంకణబంధంబు వెడలించి
యున్నంత నొక్కనాఁ డొక్క శుభముహూర్తంబున. 111

సీ. ఘనసారహిమనీరగంధసారమసారమృగనాభికామోదమేదురంబు
మణిమయపర్యంకమంజూషికాసాలభంజికాపుంజవిభ్రాజితంబు
తపనీయముక్తావితానకళావికావ్యజనదర్పణచామరావృతంబు
కాలాగరుదశాంకకాళికసాంబ్రాణికాధూపవాసనాగంధిలంబు

గీ. వీటికావేటికాజాలవిలసితంబు
కజ్జలకరండమండలాఖండరత్న
దీపసంతానదీపితోద్దీపితంబు
నైనయొక కేళికాగృహాభ్యంతరమున. 112

క. మదనవిభంజనుఁ, డతిస
మ్మదహృదయాంబురుహుఁ డగుచు మహిలామణికై
యెదురెదురు చూచుచుండఁగ
మదవతు లొకకొంద ఱపు దమందప్రేమన్. 113

గీ. బాలికామణిఁ గైసేసి పడకటింటి
కెలమితోఁ దోడుకొని చని యిందుమౌళి
యొద్దఁ గదియించి తమ్ములం బొసఁగఁజేసి
చనిరి సన్నకసన్న నాశంభుఁ డపుడు. 114

గీ. చిగురుఁబోఁడిని సెజ్జకుఁ దిగిచి బుజ్జ
గించి కౌఁగిటఁ బెనచి కోర్కెలు దలిర్పఁ
గామశాస్త్రోక్తనియతి నక్కంజముఖిని
రతులఁ గరఁగించి సుఖలీలఁ గ్రాలుచుండె. 115

వ. అట్లు నవోఢాసంగమసౌఖ్యానుభవలీలావైభవంబునం జెలంగుచుఁ, గొన్ని వాసరంబు లచటనుండి యంతట నొక్కనాఁడు యథాస్థానంబునకు వేంచేయ నుద్యోగించి, మహాదేవుండు శంఖదేవున కత్తెఱం గెఱింగించిన నతం డిట్లని విన్నవించె. 116

క. దేవా! నాకులమెల్లను
బావనమై వెలసె భక్తపాలనవిద్యా
ప్రావీణ్యం బేర్పడఁగా
నీ విచ్చటి కరుగుదెంచి నిలుచుటకతనన్. 117

గీ. దేవ! మాయింట నెప్పుడు నీవు నిలిచి
యుండవలె ననుకోర్కె లో నుండు నాకు
వెఱతు నిమ్మాట మీతోడ విన్నవింప
నింక మీచిత్త మెట్టిదో యెఱుఁగ నేర. 118

క. మా కిట నీ వల్లుఁడవై
ప్రాకటగతి నిలిచియున్నభాగ్యంబునకున్
లోకు లెఱుంగఁగ నన్నుం
జేకొని ధన్యునిగఁ జేయు సితకరమకుటా! 119

ఆ. అనిన మెచ్చి శంభుఁ డటులేని దివ్యజ
లాపహారలింగరూపి నగుచు
నీగృహమున నుండు నిశ్చలభక్తితో
నన్ను గొలుచుచుండు నయవిచార! 120

వ. అని యతండు గోరినట్లనె కృపఁజేసి మన్నించి యతని నచ్చట నుండ నియమించి మహోత్సాహంబున. 121

గీ. అభవుఁ డప్పుడు దివ్యదుందుభులు మొఱయఁ
బ్రమథవరులును దివిజులు బలసికొలువ
గంగతోఁ గూడి వృషరాజగమనుఁ డగుచు
లీల వేంచేసెఁ గైలాసశైలమునకు. 122

ఉ. అంతకమున్న నారదమహామునివర్యుఁడు వెండికొండ కే
కాంతము గాఁగ నేఁగి గిరికన్యక గన్గొని యంబ! శూలి దా
సంతస మొప్ప గంగ యనుజాలరికన్నియఁ బెండ్లియాడి నీ
చెంతకు వచ్చుచుండె నిదె చెప్పితి నీకు సవిస్తరంబుగన్. 123

క. అని దివిజమునివరేణ్యుఁడు
వినిపించి యథేచ్ఛ జనిన విస్మయ మొదవన్
మనమున హిమవద్భూధర
తనయ దిగుల్ పూని తద్దఁ దలఁకుచు నుండెన్. 124

సీ. అంతట శంకరుఁ డఖిలామరుల యథాస్థానంబులకుఁ బంచి సరభసముగ
గౌరికి వెఱచి యా గంగను జడలలో నిడుకొని నగరున కేఁగుటయును
గొరకొరతోడ నక్కుధరేంద్రనందన తలుపులు బంధించి చల మెలర్ప
మీనాంకదమనుని లోనికి రాకుండ నతికఠినోక్తుల నాడుచున్న

గీ. మదిఁ గలంగి పురారి యమ్మధురవాణి
కిట్టు లని పల్కె నహహా! నీ కిట్టికినుక
యేల నామీఁదఁ బొడమె? నే నేమితప్పు
సేసితి వచింపఁగదవె నాచెంత నిపుడు. 125

క. భక్తపరాధీనుఁడ నే
భక్తుల నరయంగఁ గోరి ప్రతిదివసము నా
సక్తిని దిరుగుచు నుండుదు
వ్యక్తావ్యక్తుండ నగుచు వనజాతముఖీ! 126

వ. కావున నాకుం దప్పుగా విచారించి కవాటబంధనం బొనరించు టుచితంబె యనిన
నతనికి భవాని యి ట్లనియె. 127

గీ. ఎచటి కేగితి విందాఁక నెచటినుండి
యెవ్వఁడవు నీవు నీ తెఱు గే నెఱుంగఁ
గ్రొత్త పెండిలికొడుకులాగునఁ గడింది
సొగసు గైకొనియున్నావు చూడ నిపుడు. 128

గీ. తివిరి కామాంధకారివై తిరుగుప్రోడ
వేమి నీజాడ యింతయు నెఱుఁగరాదు
తెలియఁజెప్పు మటన్న నద్దేవితోడ
నిందురేఖాశిఖామణి యిట్టు లనియె. 129

క. పర్వేందువదన! విను మే
సర్వజ్ఞుఁడ నహహా! మేలు సర్వజ్ఞుని పై
నుర్విని జను లెవ్వారు న
ఖర్వమతిం దలఁగి పోరు గద పరికింపన్. 130

గీ. నీలకంఠుండ నే హరినీలవేణి!
నీ చెలిమిఁ గోరుకొని వచ్చి నిలిచినాఁడ
నౌర! మే ల్నీలకంఠుఁడ వైతివేని
కేక లిడుకొంచు వేగంబె గిరికిఁ జనుము. 131

క. క్రీడాకిరాతుఁడను నేఁ
జేడియ! యటులైన నీవు జింకలు పులులుం
గ్రోడంబులు గలయడవికిఁ
బోడిమితో వేఁటలాడఁ బొమ్మా నెమ్మిన్ 132

సీ. అబల నేఁ బశుపతి నహహా! నీ వట్లైన నాలమందకు ఱంకె లడరఁ జనుము
స్థాణుఁడ నేను గంజాతాక్షి! యబ్బబ్బ మోడు మాటాడుట చూడ మెందుఁ
బురసంహరుఁడ నేను బోలఁతి! నీవట్లైనఁ మావీడనుండక మరలి పొమ్ము
పన్నగధరుఁడను బడఁతి నీవట్లైనఁ బడిగె లెత్తుచు నూళ్ళఁబడి తిరుగుము

గీ. భూతనాథుఁడ నేను బూఁబోఁడి! యట్టు
లేని నలప్రేతభూముల కేగు మిపుడె
కుటిలకుంతల! నే మహానటుఁడ నట్టు
లైనఁ బ్రభువుల కడ కేఁగి యాడు మెలమి. 133

క. చిగురాకుఁబోఁడి! విను మే
నగవాసుఁడ నట్టులౌదవినన్ ఱెక్కలతో
గగనమున కెగసి చెట్లకు
జగతస్థితి నిలువఁబోక చనుమా వేగన్ 134

గీ. విను విరూపాక్షుఁడను నేను వనజవదన!
యహహా! బుధులు విరూపాక్షుఁ డైనవానిఁ
జూడరా దని తలఁచుగ నాడుచంద్రు
తొలఁగివేంచేయు మిఁకఁబెక్కుపలుకు లేల. 135

గీ. అనుచుఁ దానాడు మాటల కగతనూజ
పొసఁగఁ గల్పించి యుత్తరం బొసఁగుటయును
దలఁకి యాపూర్ణనీహారధామముఖికిఁ
గాలకంఠుండు నమ్మికగా వచించె. 136

గీ. తెఱవ! నే నేమి పాపంబు నెఱుఁగ నీవు
వట్టితప్పులు నా మీఁదఁ గట్టి యిట్లు
గలఁక నొందింప నేల యాగ్రహము మాని
వినుము నా మాట యొక్కటి వీను లలర. 137

సీ. ననఁబోఁడి! నామాట నమ్మకుండితి వేనిఁ జెనకి బెబ్బులివాఁతఁ జె య్యిడియెద
గట్టిగాఁ బెనుబాముఁ బట్టి యాడించెద విష మైన మ్రింగెద వెఱపు లేక
కొదుగక వడిఁ బెద్దగుడి సొచ్చి నిలిచెద నవలీల గోపదం బంటుకొనెద
నంకిలి లేకుండ నగ్గి ధరించెదఁ బట్టుగా ద్విజరాజు ముట్టుకొనెద.

గీ. మఱియు నేబాస యైన నేమమునఁ జేతుఁ
గాన నింక నీతలంపులో మాని మాని
నీశిరోమణి! నన్ను మన్నింపు మిప్పు
డెలమితోఁడుతఁ గదియించి యేలుకొనుము. 138

గీ. అనిన నంబిక యొక్కింత యాత్మ నలరి
యోర! నీ కిట్టి బాసలు నచ్చివచ్చుఁ
బలుకు లేటికి ర మ్మని తలుపు దీసి
పిలుచటయు నేఁగి యతఁ డొద్ద నిలుచుటయును. 139

గీ. అతని సంభోగచిహ్నంబు లరసి చూచి
పార్వతీదేవి యిట్లని పల్కె నహహా!
యిప్పు డే నేమి పాపంబు నెఱుఁగ నంటి
వెచటి వీచిన్నెలో నాకు నెఱుఁగఁ జెపుమ. 140

క. పసుపును గుంకుమ గంధము
నసమాంబక! నీదుమేను నట్టువదలి యే
బిసరుహముఖి యంటించెనొ
కసరక నాతోడ నిపుడు గట్టిగఁ జెపుమా. 141

వ. అనిన భవుం డి ట్లనియె. 142

క. విను మానిని! జనులందఱు
వెనుకయ్యను బూజసేయ వెస నాతఁడు నన్
బెనఁగి కవుంగిటఁ బొదవినఁ
దనువున నవి యంటుకొనియెఁ దప్పే నాకున్. 143

గీ. కాలకంధర! నీ మోవిగంటు లేమి
కారణంబునఁ బొదవె నా గౌరి! వినుము
మరునితోడ నెదిర్చి సంగర మొనర్చు
తఱిని గోపించి కీరంబు గఱచెఁ జుమ్ము. 144

క. హాటకగిరిధర! నీ మెయిఁ
గాటుక యంటిన దదేమి కారణ, మబలా!
కాటుక కా దిది కుత్తుక
గాటపుగరళప్రభావికాసము సుమ్మీ. 145

క. మే లెంతటి నెఱజాణవొ
బాళిగ దత్తురములాడి వంచించెదవో
బాలేందుజూట! నీ మెయిఁ
బూ లంటుకయున్న వేల పొంకక చెపుమా. 146

గీ. భామ! విను మున్ను శ్వేతుఁ డన్నక్తవరుఁడు,
వెలవెలందికిఁ బూల్గొంచు వెడలునెడలఁ
గొన్ని మహిమీఁద వ్రాలినఁ గోరి వాఁడు
నాకు నర్పింప నవి యంటి నాటుకొనియె. 147

క. పన్నగరాజాంగద! నీ
కన్నుల కెఱుపేల గలిగె? గౌరీ! భక్తుల్
ని న్నర్ధరాత్రివఱకు
నన్ను న్జాగరణ మునిచినం బొసఁగె నిటుల్. 148

గీ. అంచు నిరువురు నిటు భాషించుతఱిని
నీలకంఠుండు మోహంబు నిలుపలేక
సర్వమంగళచరణకంజములమీఁద
వ్రాలె న న్నుద్ధరింపవే వనిత! యనుచు. 149

క. వ్రాలినఁ గనుఁగొని గిరిసుత
మే లహహా! జాణ వగుదు మెచ్చితి నిన్నున్
లే లె మ్మనుచుఁ కవుంగిటఁ
గీలించి విభుని మనోజకేళిం దేర్చెన్. 150

వ. అ ట్లుమామహేశ్వరు లన్యోన్యానురాగంబు లినుమడింప నఖండమహావైభవంబునఁ
బ్రమోదింపుచుండి యొక్కనాఁడు. 151

క. వేడబ మొప్పఁగ నెత్తం
బాడుచు నున్నంత గిరిజయాటకు లోనై
యోడి శివుఁ డూరకుండినఁ
గ్రీడామోదమున గౌరి కిలకిల నవ్వెన్. 152

వ. అప్పు డమ్మహాదేవియౌద్ధత్యంబు సహింపలేక శివజటాగ్రంబున గంగ తొంగి
చూచిన దానిఁ గనుంగొని భవాని శంకరునిమొగంబు చూచి యి ట్లనియె. 153

గీ. ఏమిపాపం బొకింత నే నెఱుఁగ నందు
వహహా! నీ కెంజడలలోన నడఁగి తొంగి
తొంగి చూచుచు నున్న దేధూర్తసతియొ
ధానిచందంబు తెలుపుమా తడయ కిపుడు. 154

క. మును దారుకావనంబున
మునిదారల భ్రమలఁ బెట్టి మోహింపఁగఁ జే
సినమేటివన్నెకాఁడవు
నినుఁ జెప్పఁగ నేల యింక నేఁడు వృషాంకా! 155

క. భల్లాణరాజుకూరిమి
యిల్లా లై కడిఁదిహొయల నింపొందినయా
చెల్లాంబం గామించిన
బల్లిదుఁడవు నీహొరంగు పలుకం దరమే. 156

గీ. సురలు నసురులు నమృతంబు సరుదుకొనఁగ
లేక పోరాడుచోఁ జక్రి లీల నొక్క
నెలఁత యై పంచి యిడుచున్న నీవు దాని
వెంటఁ బడి పర్వులెత్తవె వేడబమున. 157

వ. అని మఱియు ని ట్లనియె. 158

ఉ. అక్కట! నీవు న న్నిటుల నారడిఁబెట్టి కలంపఁ జూచుటల్
నిక్కముగా మదిం దెలియనేరక యూరక మోసపోతి నిం
కెక్కడిసత్యశౌచములు హీనకులంబువెలందిఁ బెండ్లియై
దక్కగ నెత్తిఁ బెట్టుకొని టక్కులు వల్కెద వేమి చెప్పుదున్. 159

గీ. తివిరి నా మీఁద నొక్కతె దెచ్చి యిపుడు
లేదు లే దని బొంకు పల్కెద వయారె!
దానిఁ గ్రిందికి దించి నాదటిని నిల్పి
మాటలాడించుమా యింక మరుగు లేల. 160

క. తగులమి యొకచోఁ దక్కరి
వగ లొకచోఁ బెరయఁ జెలుల వంచింతురు గ
ట్టిగ నెట్టిబాస చేసిన
మగవారిని నమ్మరాదు మాట లిఁ కేలా. 161

వ. అని పలుకుచున్న సమయంబున. 162

క. నిగిడెద కొరకొరతోడన్
మొగమించుక జేవురింపఁ బోటిమి నగ్రం
బుగ నగభవనునిగడితపు
సిగలోపలనుండి గంగ చివ్వన నుటికెన్. 163

వ. అప్పుడు భవాని దానిం గనుంగొని యి ట్లనియె. 164

క. ఎక్కడిదానవె నీ వెటు
లక్కజముగ నా హృదీశునౌఁదలపైఁ బెం
పెక్కఁగ వసించి యిప్పుడు
చిక్కిన నుటికితివి బుద్ధిసెప్పెదఁ జుమ్మీ. 165

క. నీ వెక్కడ నే నెక్కడ
భావజహరుఁ డెచట నోసి పరఁగంగ నిఁకన్
గావర ముడిగి తటాలున
వేవేగ మదాలయంబు వెలువడి పొమ్మా. 166

క. పోకుంటివేని నిన్నున్
రాకాసులవంటిప్రమథరాజోత్తములన్
దీకొలిపి ప్రోలు వెడలఁగ
నూకింతుఁ జుమీ చలంబు నూలుకొనంగన్. 167

వ. అనినం బార్వతీదేవికి భాగీరథి యి ట్లనియె. 168

గీ. అక్కరో! యిట్టిమాటల నాడనేల
నీవు శంభునిఁ గోరి ము న్నేవిధమున

వచ్చి చేకొనియున్నావొ వాలెముగను
నేను నటువలె వచ్చినదానఁ జువ్వె. 169

క. చిగురాకుఁబోండ్ల కెల్లను
మగఁ డేమారగను మేటిమక్కువతోడన్
సగమేన నిల్పుకొన్నను
సిగలో నిడుకొన్న నీకు జెల్లుఁ గదమ్మా! 170

వ. అనిన భవాని దాని కి ట్లనియె. 171

క. మే లహహా! యెంతటి గ
య్యాళివె చేరినటులుండ కఱచెదవు కడుం
గూళికి వచ్చినయాతఁడు
పాలికిఁ బట్టినక్రియ న్విపర్యాసముగన్. 172

ఆ. అడుగు నిలుపనీక వడికొట్టుచూపుచు
నింగి ముట్టి మిగులఁ బొంగె దేమి
గట్టివాతనంబు గనఁబడ నౌనె నీ
నిలువు నీరు గాను నీచురాల! 173

వ. అనిన గంగ యి ట్లనియె. 174

ఆ. పెద్దదాన ననుచుఁ బెళపెళనార్చుచు
జగమ లెల్ల మ్రింగఁజాలునట్టి
సత్తిరూపు పూని జడిపింపవచ్చెదు
కినుక నిగుడ నీవు గిరితనూజ! 175

వ. అనిన హైమవతి యి ట్లనియె. 176

గీ. నిచ్చనిచ్చలుఁ బంకంబు నివ్వటిల్లఁ
గోరి మితిలేనిజలచరకోట్లలోన
నడచుకొనియుండుచెనటు వయారె! నీవు
నన్ను నెదిరింప నెట్టిదానవె తుటారి! 177

ఆ. వక్రగతులచేత వాలెంబుఁ బెక్కుత్రో
వల వెలుంగుచుండి కలఁక నిగుడఁ
దూఱి మొరసె దేమి దుష్కీర్తి బొడవి నీ
బ్రతుకు బైలుగాను పలువదాన! 178

క. అనిన న్జాహ్నవి గిరిసుతఁ
గనుఁగొని యి ట్లనియె నీవు ఘనురాలవె మేల్
మును చండిక వై యొకకా
రెనుపోతును జంపి దాని హితమతిఁ గొనవే. 179

గీ. సకియ యూరూర దేశదేశములఁ బెద్ద
సత్తి వై నిల్చి కూళ్లను శాకములును
గోళ్లు గొఱియలు గుగ్గిళ్లు కుడుము లట్లు
దనివిసన మెక్కు కడుపుబద్దరివి గదవె. 180

వ. అనిన నంబిక యి ట్లనియె. 181

గీ. ఓసి గయ్యాళి! నీ కింతరోస మేల
చెడుగుజాలరివానింటఁ బొడమి బిట్టు
చేఁప జెల్లలు దిని మేను చెందకున్న
పరికెతవు నీవు నాతోడ సరియె చెపుమ. 182

వ. అనిన భాగీరథి యి ట్లనియె. 183

గీ. అప్పరో! యింక నీగుట్టు చెప్పనేల
కల్లు గంజాయి నంజుడు నెల్లప్రొద్దు
బాళిగాఁ దినుకడజాతివానియింటఁ
బుట్టితివొ లేదొ చెప్పుమా గట్టిగాను. 184

వ. అని యిత్తెఱంగున నిరువురు వాదింపుచున్న సమయంబున గాత్యాయనీదేవి మహా
దేవుని మొగంబు సూచి యి ట్లనియె. 185

గీ. అకట! నామీఁద నీ విపుడొకతెఁ దెచ్చి
వాద మొదవించి యెఱుఁగనివానిఁబోలెఁ
జూచుచున్నాఁడ వింక నీచొప్పు దెలిసె
నంచుఁ గోపించి చనుచున్న నళికి హరుఁడు. 186

గీ. వనితపదపద్మములమీఁద వ్రాలి నేను
దప్పుసేసితి లోఁగొమ్ము దయ దలిర్ప
నిందుముఖి! యింక నెలంతుక లెంద ఱున్న
నీవు పట్టంపుదేవివి గావె చెపుమ. 187

వ. అని బుజ్జగించి గాఢాలింగనంబు గావించి గంగచేత భవానికి మ్రొక్కించి వారిద్దఱిం
గనుఁగొని యి ట్లనియె. 188

ఆ. ఒక్కచోటఁ బుట్టి యొక్కనిఁ జెంది మీ
లోన మీకు వైర మూని యిట్లు
పో రొనర్ప నేల పొలఁతుకలార! మీ
రొద్దిమీఱఁ గూడియుండుఁ డింక. 189

క. అని నగసుత నర్ధాంగం
బున జాహ్నవి నుత్తమాంగమున నిడి కమలా
సనముఖ్యులు గొలువఁగ శివుఁ
డెనయొదవనిఠీవి జగము లేలుచు నుండెన్. 190

సీ. గడితంపుముప్పన్నెకడిఁదిదుప్పటియును బసమీరుబంగారుపట్టుచేల
రుచిరాభినవచారురుద్రాక్షమాలికల్ మురువైనహురుమంజిముత్తెసరులు
భువనాభిరామవిభూత్యంగరాగంబు సారకాశ్మీరపటీరచర్చ
భూరిశోభాకీర్ణభుజగభూషణములు మణిమయతపనీయమండనములు.

గీ. పాండురారుణవర్ణవిభ్రాజమాన
గాత్రమును గల్గి శృంగారగరిమ నలరు
నర్ధనారీశ్వరేశ్వరుఁ డభవుఁ డిందు
మౌళి భక్తాళి ననయంబు మనుచుచుండు. 191

గీ. అనుచు భీష్ముండు పాండుపుత్త్రునకు గంగ
కథ యెఱింగింప నలరి యాపృథుబలుండు
నిటలలోచనుఁ దలఁపున నిలిపి మ్రొక్కి
యతితరామోదహృదయుఁ డై యలరుచుండె. 192

గీ. శాలివాహనశకవర్షసంఖ్య వసున
వాంగశశిసంజ్ఞ నలరుధాతాబ్దముననను
దగ రచించిన యీ కృతి ధరణియందు
నాసుధాకరతారార్క మగుచు నుండు. 193

క. వినుఁ డీకృతి ముప్పదియొక
దినమునకుం జెప్పినాఁడ దేవునియానన్

1. నగాంగ — సాధుపాఠం. నవాంగ — తా. ము. ప్రా. గ్రంథాలయ. ప్రతి

జనులెన్నఁ గుక్కుటేశ్వరు
ఘనకరుణాదృష్టివలనఁ గవివరులారా! 194

క. ఈ కథ చదివిన వ్రాసినఁ
బ్రాకటముగ విన్న జనులపాపము లడఁగున్
జేకురు సకలసుఖంబులు
శ్రీకంఠునికరుణచేత సిద్ధము గాఁగన్. 195

## ఆశ్వాసాంతము

చ. అరిబలదర్పశోషణ! మహాహివిభూషణ! సత్యభాషణా!
సరసకృపానిరీక్షణ! విచక్షణరక్షణ! పుణ్యలక్షణా!
హరిముఖనిర్జరావన! విషాగ్నినిషేవన! విశ్వభావనా!
సరసిరుహాక్షసాయక! లసత్ఫలదాయక! లోకనాయకా! 196

## తోటకవృత్తము

శివ శంకర శాశ్వతశిష్టరతా, భవ భర్గ సమాశ్రితభక్తహితా
దివిషజ్జనసేవిత ధీమహితా, వివిధాగమవందిత విశ్వనుతా. 197

## మాలినీవృత్తము

ప్రముదితమునిజాలా! భక్తలోకానుపాలా!
శమసమదవిభంగా! చారుగంగోత్తమాంగా!
ప్రమథగణసనాథా! పార్వతీప్రాణనాథా!
కుముదహితకలాపా! కుక్కుటాధీశరూపా! 198

గద్యము - ఇది శ్రీమత్కుక్కుటేశ్వర కరుణాకటాక్షనిరీక్షణ సంలబ్ధ సరసకవితా సామ్రాజ్య ధురంధర, ఘనయశోబంధుర, కౌండిన్యసగోత్రపవిత్ర, కూచిమంచి గంగనామాత్యపుత్ర, సకలసంస్కృతాంధ్రలక్షణకళాకౌశలాభిరామ తిమ్మకవి సార్వభౌమప్రణీతంబైన శివలీలా విలాసంబను శృంగారరసప్రబంధంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము.

శివలీలావిలాసము సమాప్తము.

* * * *

శ్రీః

78



సంపాదకుడు

'రామోరా'

త్వరలో...

కంకంటి నరసింహరాజు విరచిత

# విష్ణుమాయావిలాసము

**Check List**

| Book Number | RMR01A12 | Date | 4/8/22 |
|---|---|---|---|
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CI, 77 | | |
| Missing Pages | NO | | |
| Prepared By | prabhusekhar | Cutting By | prabhusekhar |
| Scanned By | Sandhya | Pages | 81 |